REGISTERED No M. 989. Vol I, No. 3.

శ్రీ

# హిందూజనసంస్కారిణి

ప్రత్యాంగ్లేయ మాసాంత్యముల

ప్రకటింపఁబడు

వివిధవిషయక మాసపత్రిక.

## 'HINDUJANA SAMSKARINI'


| | | |
|---|---|---|
| ద్వితీయకల్పము<br>సంపుటము 1 | 1912 అక్టోబరు<br>1912 October | సంచిక<br>3 |



మన్నవ. సింహాచలముపంతులు. పత్రికాధిపతి.

పురశవాకము, వేపేరిపోష్టు, మదరాస్. ఎ౯. సి.

**Editor**

**Mannava Simhachalam Pantulu.**


విషయసూచిక.



చందా వివరణము.

| | | | | |
|---|---|---|---|---|
| పోషకులకు | సంవత్సరము | 1-కి | రూ. | 12-0-0 |
| సహాయులకు | ,, | ,, | | 6-0-0 |
| చందాదారులకు | ,, | ,, | | 3-0-0 |


Printed at the Jyotishmati Press, Madras.

1912

# పోషకులు.

మహారాజశ్రీ, కొమర్రాజు - వెంకటలక్ష్మణరావుపంతులుగారు. ఎం. ఏ.
దివాన్ మునగాలసంస్థానము.

---

## ప్రకటన.

### మన్నవ-బుచ్చయ్యపంతులుగారిచే ప్రచురింపబడిన గ్రంథములు.

(పదవిభాగ ప్రతిపదార్థ తాత్పర్య సారాంశములతోడ.)

| | | | |
|---|---|---|---|
| ఈశావాస్యోపనిషత్తు | 0 | 2 | 0 |
| కేనోపనిషత్తు | 0 | 3 | 0 |
| కఠోపనిషత్తు | 0 | 8 | 0 |
| ప్రశ్నోపనిషత్తు | 0 | 8 | 0 |
| ముండకోపనిషత్తు | 0 | 6 | 6 |
| మాండూక్యోపనిషత్తు | 0 | 4 | 0 |
| ఐతరేయోపనిషత్తు | 0 | 6 | 6 |
| తైత్తిరీయోపనిషత్తు (శిక్ష, ఆనందము, భృగు, నారాయణములు.) | 1 | 8 | 0 |
| బృహదారణ్యకోపనిషత్తు | 4 | 0 | 0 |
| ఛాందోగ్యోపనిషత్తు | 5 | 0 | 0 |
| శ్వేతాశ్వతరోపనిషత్తు (అచ్చగుచున్నది.) | | | |
| వజ్రసూచికోపనిషత్తు | 0 | 1 | 0 |
| బ్రహ్మోపనిషత్తు | 0 | 1 | 6 |
| పురుషసూక్తము | 0 | 2 | 0 |
| శ్రీసూక్తమ్ | 0 | 1 | 0 |
| యజుర్వేదులసంధ్యావందనమ్ | 0 | 7 | 6 |
| వర్ణోత్పత్తి వివరణము | 0 | 0 | 6 |
| ఋగ్వేదసంహిత, ప్రథమాష్టకము, తెలుగున ఋక్కు— | 5 | 0 | 0 |
| ఋగ్వేదుల సంధ్యావందనమ్ (అర్థముతోడ.) | 0 | 6 | 6 |
| ఋగ్వేదుల వివాహప్రయోగము (తెలుగర్థసహితముగ) | 1 | 8 | 0 |

| | | |
|---|---|---|
| పరాశరస్మృతి, మాధవాచార్య భాష్యానుసారముగ తెలుగు తాత్పర్యసహితము) | 0 | 10 |
| వృద్ధపరాశరస్మృతి (తెలుగర్థ సహితముగ) | 0 | 2 |
| శాతాతపధర్మశాస్త్రము (అచ్చగుచున్నది. | | |
| శాతాతప సంహితా | 0 | 4 |
| యాజ్ఞవల్క్యస్మృతి (మూడు కాండములు) | 1 | 8 |
| లిఖితస్మృతి (తెలుగర్థసహిత) | 0 | 8 |
| లిఖిత సంహితా | 0 | 2 |
| ఔశనస్మృతి (తెలుగర్థ సహితముగ) | 1 | 4 |
| దక్షస్మృతి | 0 | 5 |
| శంఖలిఖిత ధర్మశాస్త్రము | 0 | 2 |
| శంఖధర్మశాస్త్రము | 0 | 9 |
| హారీత ధర్మశాస్త్రము | 0 | 5 |
| బుధ ధర్మశాస్త్రము | 0 | 2 |
| పులస్త్యధర్మశాస్త్రము | 0 | 2 |
| బృహస్పతి ధర్మశాస్త్రము | 0 | 3 |
| దేవలధర్మశాస్త్రము | 0 | 3 |
| గౌతమస్మృతి | 1 | 0 |
| ఆశ్వలాయన ప్రవరకాండము | 0 | 2 |
| ఆపస్తంబ ప్రవరకాండము | 0 | 2 |
| యజుర్వేదుల వివాహప్రయోగము | 1 | 4 |
| యజుర్వేదుల ఆబ్దికమంత్రములు | 0 | 10 |

☞ మా చందాదారులకు నవంబరు నెలాఖరువఱకు నూటికి రు 25 లు చొప్ప
క్రయమునుండి మినహాయించెదము.

పోస్టేజి ప్రత్యేకము. }

మన్నవ - సింహాచలముపంతులు
"హిందూజన సంస్కారిణి" కార్యస్థానమ
పురశవాకం. వేపేరిపోస్టు; మద్రాస్. ఎస్.

# హిందూజనసంస్కారిణి

ప్రత్యాంగ్లేయ మాసాంత్యమునఁ
ప్రకటింపఁబడు
వివిధవిషయక మాసపత్త్రిక.

| | | |
|---|---|---|
| ద్వితీయకల్పము | 1912 అక్టోబరు | సంచిక |
| సంపుటము 1 | 1912 October | 3 |

## స్వవిషయము.

ఆర్యమహాశయులారా!

"హిందూజన సంస్కారిణి" అను పేరంబరఁగు మాసపత్త్రికను చాలకాలము నా తండ్రిగారైన మన్నవ-బుచ్చయ్యపంతులుగారు ప్రకటించుచున్న విషయము జగద్విదితమే కదా. వారు స్వర్గవాసులైన పిమ్మట నీపత్త్రికా ప్రకటనము నిలిచిపోయెను. ఇపుడు మరల దీనిని ప్రకటింపుఁడని పలువురు ప్రోత్సాహము చేసినందునను, శ్రీయుతులు అస్మన్మాతులులు మద్దాళి సుబ్రహ్మణ్యయ్యపంతులుగారును, మద్దాళి ఆదినారాయణయ్య పంతులుగారును మూఁడువందల రూపాయలు విరాళముగా నొసంగి మదిష్టసిద్ధికి తోడ్పడినందునను, ప్రకటింపఁ దొడంగినాఁడను. ఇందు ఇంతకుమున్ను ముద్రింపఁబడిన ఉపనిషత్తులకెల్ల శ్రీశంకరాచార్యకృత వ్యాఖ్యానమును, ఆనందగిరి టీకానుసారముగ తాత్పర్యమును ముద్రింపఁబడును. మఱియు కేవలము వేదాంతగ్రంథములనుమాత్రమేగాక తత్కాలోచితముగ నితర గ్రంథములనుగూడఁ బ్రకటింపఁబడును. మహాభాగు లగు వారెల్లరును నా తండ్రిగారియందుంచిన యభిమానము నా యందునుంచి పత్త్రికాభివృద్ధి చేయఁ గోరఁబడియెదరు. మఱికొందఱకును పత్త్రిక పంపఁబడినది. ఎల్లరును పత్త్రికాగ్రహీతలై పోషకులుగను చందాదారులుగ నుండి సహకారు లగుదురని ప్రార్థించుచున్నాఁడను. భిజ్ఞులకు విశేషముగా విన్నవింపఁ బనిలేదు.

# హిందూజనసంస్కారిణి.

## 'విశేషవిజ్ఞాపనము.'

...దేశమునందైనను సరియే 'యత్న కార్యసిద్ధికి ధనవంతులు సహాయపడవలయును. ...నేకార్యమును నెఱవేఱదు. కావున ఆంధ్రదేశీయు లగు మహారాజులును రాజు... లు జమీందారులును ధనికులును సాహుకారులును సహాయముచేసి పత్రికాభివృద్ధి ...ప్రవించెదము.

## 'గ్రంథకర్తలకు విజ్ఞప్తి.'

...ముద్రించుటకుఁ దగిన గ్రంథములను రచించినవారును, అట్టి గ్రంథ... దయచేసి మాకుఁ దెలియఁజేసినచో వలయువానిని బహుమానము ...సంసిద్ధులమై యున్నారము. జ్ఞానవిజ్ఞానగ్రంథము లేవియైనను

## 'పత్రికాధిపతులకు విన్నపము.'

...డకు లెల్లరును పరివర్తనక్రమము ననుసరించి తమ పత్రికలను పత్రికనుగూర్చి ప్రశంసింప వేఁడెదము. మేమును మాపత్రిక... ...నుగూర్చి ప్రశంసింపఁ గలవారము.

## 'పత్రికాగ్రహీతలకు మనవి.'

...ను భాషాభిమానులును మతాభిమానులును మాయందు సంపూర్ణాను... ...గ్రహముంచి పత్రికాభివృద్ధి యగునట్లు పోషకులుగనో చందాదారులుగనో యుండుట మేగాక, దీనిని తమ తమ మిత్రమండలియందును వ్యాపింపఁజేసి దినదినాభివృద్ధి యగునట్లు కావింపవలయు నని ప్రార్థించెదము.

## చందా వివరణము.

| | | | | |
|---|---|---|---|---|
| పోషకులకు | సంవత్సరము | 1-కి | రూ. | 12-0-0 |
| సహాయులకు | ,, | ,, | | 6-0-0 |
| చందాదారులకు | ,, | ,, | | 3-0-0 |

హిందూజనసంస్కారిణి ఆఫీస్,
మదరాసు
1912

ఇట్లు
మన్నవ-సింహాచలముపంతులు
పత్రికాధిపతి.

365

## విన్నపము.

ఆర్యులారా! ఈపత్రికతో మూఁడునెలల పత్రికలు తమకుఁ బంపియున్నారము. ఇదివఱకు తమతమ యభిప్రాయములను దెలియచేయనివారు ఇఁకనైనను దయచేసి తెలుపవలయునని కోరెదము. మౌనముగా నుండినచో మా పత్రికను గ్రహించినట్లుగనే భావించి పైనెలపత్రికను వి. పి. గా పంపుదుము.

---

## కృతివిమర్శములు.

లక్ష్మీపతిశతకము:—ఇది విజయనగరములో ప్లీడరుగానుండు మ-రా-రా-శ్రీ, జయంతి వెంకన్న కవిగారిచే రచితమైనది. 'లక్ష్మీపతేఘుడితిపాలయమాంప్రపన్నమ్' అను మకుటముగల్గి వసంతతిలకావృత్తశ్లోకములతోఁ దనరారుచున్నది. పండితులకును పామరులకును పఠనయోగ్యంబైనదిగను హృద్యంబైనదిగ నున్నది. దీనివెల తెలియలేదు. గ్రంథము చిన్నదిగను అందమైన ముద్రణముగలదిగ నున్నది.

---

రాఘవశతకము:—ఇది మ-రా-రా-శ్రీ ముత్యసూర్యనారాయణశర్మగారిచేత రచియింపఁబడినది. 'రాఘవా' అను మకుటముగల చంపకోత్పలమాలికా పద్యమయమైనది. కవిత్వము హృదయానందజనకంబై యున్నది. వలయువారు గోదావరి జిల్లా పెద్దాపురముతాలూకా కిర్లమపూడియందుండు గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించుకొననచ్చును.

---

ఆంధ్రప్రకాశిక:—ఇది మద్రాసునందు వారమునకు రెండుసారులు ప్రకటింపఁబడు వృత్తాంతపత్రిక. దీనికి చందా సంవత్సరమునకు 6-0-0. ఇందు రాజకీయ విషయములును ఇతర లౌకిక విషయములును చక్కఁగా పరిశీలించి వ్రాయఁబడుచుండును. ఆంధ్రవార్తాపత్రికలలో నిదియే మనకు వృద్ధపత్రికయై వెలయుచున్నది.

---

సువర్ణలేఖ:—ఇది తణుకునందు ప్రకటింపఁబడు వారపత్రిక.—ఇందు సంఘసంస్కార విషయములును జనోపయోగకరములగు నితరవిషయములును వ్రాయంబడుచుండును. దీనికి సంవత్సరమునకు చందా 2-8-0

---

శశిలేఖ:—ఇది చెన్నపురియందు వారమున కిఱుమాఱులు ప్రకటింపఁబడు వార్తాపత్త్రిక. దీనికి చందా సం 1–కి 6–0–0. ఇదియు ఇంచుమించుగా ఆంధ్రప్రకాశిక వంటిదై తనరారుచున్నది.

---

దర్పాన్:—ఇది గుంటూరునందు ప్రకటింపఁబడు వారపత్త్రిక. దీనికి చందా సం 1–కి 2–8–0 ఇందు పెక్కువిషయము లణఁగియున్నవి. సకలజనులును గ్రహింపఁదగినట్టిది. ఇది క్రమక్రమముగా వృద్ధికావలయునని కోరెదము.

---

దేశాభిమాని:—ఇది బెజవాడయందుండి వెలువడునట్టి వారపత్త్రిక. దీనికి చందా సంవత్సరమునకు 3–0–0. ఇదియు ఆంధ్రప్రకాశికవంటిదే యగును. అయినను ఇందు సంఘసంస్కార విషయములు తఱచుగా వ్రాయంబడుచుండును.

---

ఆంధ్రపత్త్రిక:—ఇది బొంబాయినుండి వెలువడునట్టి వారపత్త్రిక. దీనికి చందా సం. 1–కి. 3–8–0. దీనియందు వివిధవిషయములు చర్చింపఁబడుచుండును. ప్రకృతమున జనులు అభివృద్ధి నొందుటకుఁ దగినమార్గము లేవో వానినిగూర్చి తఱచుగా ...సములు వ్రాయఁబడును. సకల జనులును చైకొనఁదగిన పత్త్రికయనం దగి ...ది.

---

ప్రారంభవిద్య:— ఇది ఏలూరిలో మెస్సర్సు రామా అండ్ కంపెని వారిచే ...పఁబడు మాసపత్త్రిక. చందా సం. 1–కి 1–1–0. ఇందు బాలురతరగతికి విద్య ...కు సులువైన మార్గములును, వారికి వలయు పాఠక్రమములును, ఉపాధ్యాయులు ...కొనఁదగిన పలువిషయములును గానంబడుచున్నవి. కనుక దీనిని బడిపంతులెల్లరును ...ందగునని మాయాశయము.

---

మనోరంజని:— ఇది కాకినాడలో మెస్సర్సు. జి. వెంకన్న బ్రదర్సు ...చేఁ బ్రకటింపఁడు మాసపత్త్రిక. దీనికి చందా సం 1–కి 2–0–0. ఇందు నవలలును, ...కములును, ఇంకను సమయోచితమగు పెక్కువిషయులును బ్రకటింపఁబడుచుండును.

---

ప్రభోధిని:— ఇది గుంటూరుజిల్లా దుగ్గిరాలలో ప్రబోధినీ ముద్రాక్షర ...కారులచే ప్రకటింపఁబడు మాసపత్త్రిక. దీనికి చందా యింతయని తెలియలేదు.

దీనియందు విశ్వబ్రాహ్మణులయొక్క యభివృద్ధికై పెక్కువిషయములు వ్రాయఁబడు చుండినను, ఇతరములగు వివిధవిషయగ్రంథములును ప్రకటింపఁబడుచున్నవి.

---

ఆకాశవాణి:— ఇది రాజమహేంద్రవరమునందు శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలాధిపతులచే ప్రకటింపఁబడు మాసపత్త్రిక. దీనికి చందా సం. 1-కి. 2-8-0. ఇందు గద్యప్రబంధములు, నవలలు, నాటకములు, ప్రహసనములు, ఇంకను పలువిషయములు ప్రకటింపఁబడుచుండును.

---

హిందూసుందరి:—ఇది కంతేరునుండి వెలువడు మాసపత్త్రిక. దీనికి చందా సంవత్సరమునకు 2-0-0. దీనియందు హిందూస్త్రీలు అభివృద్ధి నొందుటకుఁ దగిన విషయములే తెలుపుచుగా వ్రాయంబడుచుండును. పత్త్రికా కర్త్రి సాధ్వీమణి యగుటంబట్టియే వ్యాసములు వ్రాయువారెల్లరును స్త్రీవ్యక్తులై యున్నారు. దీనిని తలిదండ్రులు బాలికలను, యువకులు తమసతులను పఠించునట్లు ప్రేరింపఁగోరెదము.

---

అభినవసరస్వతి:—ఇది గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా జానపాడునందుండి వెలువడు మాసపత్త్రిక. దీనికి చందా సంవత్సరమునకు 2-0-0. ఇందు ప్రబంధములు, నవలలు, ఇంకను లోకోపకారమైన యితరవిషయములు ప్రకటింపఁబడుచుండును.

---

తెలుఁగులాజర్నల్ :—ఇది మచిలీపట్నము (బందరు) నుండి వెలువడు మాసపత్త్రిక. దీనికి చందా సం. 1-కి 3-0-0. ఇందు ఇండియాలోఁగల అన్ని కోర్టులలోని వ్యాజ్యములయొక్క స్వభావమును, వానిపై జరుపఁబడిన చర్యలును, న్యాయాధిపతులు తీర్మానించిన న్యాయవిధానములును సులువుగా గ్రామోద్యోగస్థులాదిగాగలవారందఱును దెలియునట్లు వ్రాసి ప్రకటింపఁబడుచుండును. కావున, న్యాయవిధానపక్షులు కాఁగోరువారి కిది చింతామణివంటిదై యున్నది.

---

ఆర్యులారా! మా కార్యాలయము నలంకరించిన వృత్తాంతపత్త్రికలనుగూర్చియు, ప్రబంధాదులను బ్రకటించు మాసికపత్త్రికలనుగూర్చియు మేము విస్తరముగా వ్రాయమిచేత వానియొక్క మహిమ స్వల్పమని యెంచకుఁడు. ఎవ్వరును నిరర్థకమైన కార్యమునకుఁ దలపెట్టరు. లోకులయొక్క ఆదరము కొలఁది పత్త్రికాభివృద్ధి యగుచుండును. గాన యెల్లవారును పత్త్రికలను గైకొని పఠింపవలయునని ప్రార్థించెదము.

---

# KAMINIA OIL DEPOT.

Kaminia Oil for beautiflying and increasing the growth of the hair, per bottle Re 1—0—0 three bottles Rs 2—10—0.

Dilbhahar Hair Oil Re 1—0—0 per bottle.

Prof. James Electro Tonic Pearls for health strength and energy per bottle of 40 pills Re 2—0—0.

Teeze Tablets (or headache) per bottle annas twelve (A. 0—12—0).

Curanue,; Specfic for Gonorrhoea and gleet. Allays, Painful Mineturition and stops burning sensation in the Urine price per bottle Re 1—8—0.

Rabiods; Idle purgative per bottle 0—10—0

Chrysoline; for Ring Worm etc. per bottle 0—4—0

Odman's Malaria Pills. for fever, Ague etc per bottle Re 1—0—0.

Kaminia cold cream, 0—12—0 per bottle. Lime Juice Glysorine 0—8—0 per bottle.

Perfumes Dilohahar per bottle Re 1—8—0 suranji, Re 1—4—0 Gulshau 1—8—0 per bottle.

Berlin Wool white and all colour per lb Rs. 3—4—0

Andhisina Wool 4 ply white and all colours per lb Rs. 3—8—0

Shetland Wool 2 ply white and all colours per lb Rs 3-8-0

Saxony Wool white and all colours Rs 3—8—0

Steel croset hooks size $1\frac{1}{2}$ to 6 per hook Rs 0—2—0

Duplex each Rs 0—1—6

Cawnpore balaclava caps ,, Rs 1—0—0

Rubber Printing outfits containing solid Rubber types selfinking pad and type holder etc per box As 12 to Rs 2-4-0

Sen Sen Chewing gum for public speakers singers etc,. containing a packet of 300 pills per packet Rs 0—2—0

Kabul Asafotida twelve tolas containing a tin pertin 0-14-0

Rolled gold chains each 4 As to Rs 5—0—0

White metal chains each Rs 0—6—0

Don't suffer agony and loss of the good teeth Just get a brush of Dentaline 0—8—0 per bottle.

(Watches Rs 2—0—0 to Rs 20—0—0)

Ask for Catalogue.

Address :—

The WOOLLEN MART,

MANGALORE.

వి. "స వా అయమాత్మా బ్రహ్మవిజ్ఞానమయః" "ఆ యీయాత్మ బ్రహ్మవిజ్ఞానమయుఁడు." అని బృహదారణ్యకోపనిషత్తునందు చెప్పఁ బడియున్నది.

అవ. ఈప్రపంచము అసద్రూప మని దృష్టాంతముతో రెండు శ్లోకములచేఁ జెప్పుచున్నారు.

అనుభూతో౾ప్యయంలోకో వ్యవహారక్షమో౾పిసన్,
అసద్రూపో యథాస్వప్న ఉత్తరక్షణ బాధతః. ౹౹౬

తా. ఈలోకము అనుభవింపఁబడునది యైనను వ్యవహారసామర్థ్యముకలది యైనను, స్వప్నమువలె ఉత్తరక్షణమునందు బాధకమై (మిథ్యయని నిశ్చయింపఁబడినదై) యుండుటచేత అసద్రూప మగును.

స్వప్నో జాగరణే౾లీకః స్వప్నే౾పి జాగరో నహి,
ద్వయమేవ లయేనాస్తి లయో౾పి హ్యుభయోర్నచ. ౹౹౭

తా. స్వప్నము జాగ్రమునందు మిథ్య. జాగ్రము స్వప్నమునందు అబద్ధము. ఆజాగ్రత్స్వప్నములు రెండును లయమైన సుషుప్తియందు లేవు. సుషుప్తి ఆజాగ్రత్స్వప్నములు రెంటియందును లేదు.

అవ. సద్రూప మిట్టిదని చెప్పుచున్నారు.

త్రయ మేవం భవే న్మిథ్యా గుణత్రయ వినిర్మితమ్,
అస్య ద్రష్టా గుణాతీతో నిత్యో హ్యేకశ్చిదాత్మనః. ౹౹౮

తా. త్రిగుణములచే కల్పింపఁబడిన మూఁడవస్థలును మిథ్యయే. వీనియొక్క ద్రష్ట గుణాతీతమును నిత్యమును ఏకము నైన చిదాత్మయే.

వి. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవి త్రిగుణములు. జాగ్రము, స్వప్నము సుషుప్తి, అనునవి త్రివిధావస్థలు.

అవ. జీవబ్రహ్మలకు భేదము మిథ్య యని దృష్టాంతముతో రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నారు.

యద్వన్మృదిఘట భ్రాన్తిః శుక్తౌవా రజతస్థితిః,
తద్వ ద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణేన పశ్యతి. ౹౹౯

తా. మృత్తికయందు ఘటభ్రాంతియును, శుక్తియందు రజతముయొక్క ఉనికియును వలె, బ్రహ్మమునందు జీవస్థితి విమర్శించిచూచినచో (ఆత్మతత్త్వముగాఁ జూచినచో) కనఁబడుటలేదు.

యథా మృది ఘటో నామ కనకే కుణ్డలాభిధా,
శుక్తౌహి రజతఖ్యాతిః జీవశబ్దస్తథా పరే. ౬౦

తా. మట్టియందు కుండయనెడి పేరును, బంగారమునందు కుండల మనెడి నామమును, ముత్తెపు చిప్పయందు వెండియనెడి పేరును వలె, బ్రహ్మమునందు జీవుఁ డనెడి నామము కలిగియున్నది.

అవ. సకల ప్రపంచమును బ్రహ్మమునందు నామమాత్రమే యని యనేక దృష్టాంతములతో నాలుగు శ్లోకములచేఁ జెప్పుచున్నారు.

యథైవ వ్యోమ్ని నీలత్వం యథా నీరం మరుస్థలే,
పురుషత్వం యథా స్థాణౌ తద్వ ద్విశ్వం చిదాత్మని. ౬౧

తా. ఆకాశమునందు నల్పును, ఎండమావులయందు జలమును, స్థాణువు (మొద్దు) నందు మనుష్యత్వమును (పురుషుఁ డనెడి భ్రాంతియును) వలె, చిదాత్మయందు (పర బ్రహ్మమునందు) ప్రపంచము కనఁబడుచున్నది.

యథైవ శూన్యే వేతాళో గన్ధర్వాణాం పురం యథా,
యథాకాశే ద్విచన్ద్రత్వం తద్వ త్సత్యే జగత్ స్థితిః. ౬౨

తా. ఏరీతిగా, శూన్యమునందు వేతాళస్వరూపమును, గంధర్వనగరమునున్నవో, ఆకాశమునందు ఇర్వురు చంద్రులుకలరో, ఆరీతిగా లోకస్థితి యున్నది. (అనఁగా మీఁదఁ జెప్పిన దృష్టాంతములను బట్టి లేదని భావము.)

వి. మేఘములవలన రాజనగరమువలె నలుపుగను బంగారు వన్నెగను కలిగి మఱిగి పోవునది గంధర్వనగర మనబడును.

యథా తరఙ్గకల్లోలై ర్జలమేవ స్ఫుర త్యలమ్,
పాత్రరూపేణ తామ్రంహి బ్రహ్మాణ్డౌఘై స్తథాత్మనా. ౬౩

తా. జలము అలలు మొదలగునవిగను, తామ్రము పాత్ర స్వరూపముగను కనఁబడునట్లు, ఆత్మత్వము బ్రహ్మాండములుగాఁ గానంబడుచున్నది.

ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నాహి తన్తవః,
జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్త దభావతః. ౬౪

తా. పృథ్వి (మన్ను) ఘటమను పేరుచేతను, నూలు పట (వస్త్ర)మనెడి నామము చేతను, ప్రకాశించునట్లు; చిత్తు జగమనెడి పేరుచేతఁ బ్రకాశించుచున్నది. దాని (ఆ పేర్ల యొక్క) అభావముచేత అది (బ్రహ్మము) తెలియఁదగినది.

వి. "వాచారమ్భణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యమ్." "నామధేయమైన వికార మనునది వాగాశ్రయ మగును. (అనఁగా సత్యవస్తువు కాదు.) మృత్తికయే సత్యవస్తు వగును. అనెడి శ్రుతివలన నెఱుంగునది.

అవ. మీఁదఁ జెప్పిన దృష్టాంతములను బట్టి సర్వత్ర విదేహముక్తియే సిద్ధించుచున్నది. జీవన్ముక్తి చెప్పఁబడలేదని యాశంకించి యిట్లని చెప్పుచున్నారు.

సర్వోఽపి వ్యావహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః,
అజ్ఞానాన్న విజానన్తి మృదేవహి ఘటాదికమ్. ౬౫

తా. లోకులచేత సమస్త వ్యవహారమును బ్రహ్మముచే చేయఁబడుచున్నది. ఘటాదులు మృత్తికయే యని అజ్ఞానమువలనఁ దెలిసికొనుట లేదు.

వి. అజ్ఞాననివృత్తియే (ద్వైతభావము లేమియే) జీవన్ముక్తి యనఁబడును.

అవ. పైని చెప్పిన విషయమును దృష్టాంతముతో దృఢపఱచుచున్నారు.

కార్యకారణతానిత్య మాస్తేఘటమృదోర్యథా,
తథైవ శ్రుతియుక్తిభ్యాం ప్రపఞ్చబ్రహ్మణోరిహ. ౬౬

తా. ఘటమునకును మృత్తికకును కార్యకారణత్వము నిత్యమై యుండునట్లే శ్రుత్యుక్తులచేత నిచట ప్రపంచమునకును బ్రహ్మమునకును కార్యకారణత్వ మున్నది.

వి. "యథా సోమ్యైకేన మృత్పిణ్డేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్." "సౌమ్యుఁడా! ఎట్లు ఒక మట్టిముద్దచేత సమస్తమును మట్టియొక్క స్వరూపమే యని తెలియఁబడుచున్నదో" అను నీ మొదలగునవి శ్రుతి ప్రమాణములు.

అవ. కార్యకారణత్వముయొక్క అభిన్నత్వమును సూచించుచున్నారు.

గృహ్యమాణే ఘటే యద్వ న్మృత్తికాభాతివై బలాత్,
వీక్ష్యమాణే ప్రపఞ్చేఽపి బ్రహ్మైవాభాతి భాసురమ్. ౬౭

తా. ఘటము తెలియఁబడునప్పుడు అత్యంతము మృత్తికయగునట్లు, విచారించి చూడఁగా ప్రపంచమును ప్రమాణాపేక్ష లేకయే ప్రకాశించునట్టి బ్రహ్మముగనే భాసిల్లుచున్నది.

అవ. అవస్థాభేదముచేత ప్రపంచము గోచరించు విధమును గూర్చి దృష్టాంతముతో చెప్పుచున్నారు.

సదైవాత్మా విశుద్ధోఽస్తి హ్యశుద్ధో భాతి వై సదా,
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశమ్. ౬౮

తా. రజ్జువు జ్ఞానులకు భయమును కలిగింపనిదిగను అజ్ఞానులకు (సర్పరూపముగా) భయమును కలిగింపించునదిగను నుండునట్లు, ఆత్మజ్ఞానులకు సర్వదాశుద్ధముగను, అజ్ఞానులకు ఎల్లప్పుడును అశుద్ధముగను నుండునట్లు తోఁచుచున్నది.

అవ. ఆత్మానాత్మవిభేదమును అవివేకు లెఱుఁగనేరరని దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

యథైవ మృణ్మయః కుమ్భ స్తద్వద్దేహోఽపి చిన్మయః,
ఆత్మానాత్మవిభాగోఽయం ముధైవ క్రియతేఽబుధైః. ౬౯

తా. ఘటము మృత్తికామయమగునట్లు దేహమును చిన్మయముగనే యున్నది. ఈవిధముగా నీయాత్మానాత్మవిభాగము అవివేకులచేత వ్యర్థముగనే కావింపఁబడుచున్నది.

వి. అజ్ఞానులు ఏవిధమునను వాస్తవతత్త్వము నెఱుంగరనియు, దేహమే ఆత్మయని తెలియుచున్నారనియును భావము.

అవ. అవివేకులయొక్క కల్పితదేహతాదాత్మ్యమును దృష్టాంతముతో అయిదు శ్లోకములచేఁ జెప్పుచున్నారు.

సర్పత్వేన యథా రజ్జూ రజతత్వేన శుక్తికా,
* వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా. ౭౦

తా. రజ్జువు సర్పత్వముగను, శుక్తి రజతస్థితిగను, నిర్ణయింపఁబడునట్లు † ఆత్మ దేహత్వముగా మూఢునిచే నిశ్చయింపఁబడుచున్నది.

ఘటత్వేన యథా పృథ్వీ పటత్వేనైవ తన్తవః, వినిర్ణీతా. ౭౧

తా. పృథ్వి ఘటత్వముగను తంతువులు పటత్వముగను నిశ్చయింపఁబడునట్లు ఆత్మ ... ... ... ...

కనకం కుణ్డలత్వేన తరఙ్గత్వేన వై జలమ్, విని ... ... ౭౨

తా. కనకము కుండలత్వముగను జలము అలలవలెను నిశ్చయింపఁ బడునట్లు ఆత్మ ... ... ... ...

---

* దీనిని నాలుగు శ్లోకములందును జేర్చి పఠించునది.

† ఇట్లే నాలుగు శ్లోకములతాత్పర్యమునందును అనుసంధింపవలసినది.

నరత్వేన యథాస్థాణు ర్జలత్వేన మరీచికా, విని ... ౨౩

తా. స్థాణువు పురుషత్వముగను ఎండమావులు జలత్వముగను నిశ్చయింపఁబడినట్లు ఆత్మ ... ... ...

గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనైవ లోహతా, విని ... ౨౪

తా. కొయ్యలుగృహములుగను, ఇనుముకత్తిగను నిశ్చయింపఁబడునట్లు, ఆత్మ....

అవ. అజ్ఞానముచే నాత్మస్థితిని తెలిసికొనకున్నాఁడని వేఱువిధముగా దృష్టాంతముతో పండ్రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నారు.

యథా వృక్షవిపర్యాసో జలాద్భవతి కస్యచిత్,
* తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః. ౨౫

తా. ఒకనికి నీటివలన వృక్షముయొక్క తలక్రిందుస్థితి గోచరించునట్లు § అజ్ఞానవశముచేత ఆత్మయందు దేహత్వమును జూచుచున్నాఁడు.

పోతేన గచ్ఛతః పుంసః సర్వం భాతీవ చఞ్చలమ్, తద్వ. ...౨౬

తా. ఓడలో పోవునట్టివానికి సర్వమును చంచలముకలదిగాఁ దోఁచునట్లు, అజ్ఞాన ... ... ... ...

పీతత్వంహి యథాశుభ్రే దోషాద్భవతి కస్యచిత్, తద్వ... ౨౭

తా. దోషముచే నొకనికి తెల్లనిదానియందు పచ్చనిరంగు కనఁబడునట్లు, అజ్ఞాన ... ... ... ...

చక్షుర్భ్యాం భ్రమశీలాభ్యాం సర్వం భాతి భ్రమాత్మకమ్, తద్వ. ౨౮

తా. భ్రమించు (తిరిగెడు) స్వభావముగల నేత్రములచేత సమస్తమును తిరుగుచున్నట్లుగా కనఁబడునట్లు, అజ్ఞాన ... ... ...

అలాతం భ్రమణే నైవ వర్తులం భాతి సూర్యవత్, తద్వ...౨౯

తా. కొఱవికట్టెను త్రిప్పుటవలననే సూర్యునివంటి వృత్తము తోఁచునట్లు, అజ్ఞాన.

మహత్త్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతిదూరతః, తద్వ. ౩౦

తా. సకలవస్తువులయొక్క మహత్త్వమును అతిదూరముచేత అణుత్వముగాఁ గనఁబడునట్లు, అజ్ఞాన. ... ... ... ...

---

* ఇట్లే పదునొకండు శ్లోకములందును జేర్చి పఠింప వలసినది.

§ ఈవిధముగా పదునొకండుశ్లోకముల తాత్పర్యమునందును జేర్చి చదువునది.

సూక్ష్మత్వే సర్వభావానాం స్థూలత్వంచోపనేత్రతః, తద్వ. ౨౧

తా. సకలవస్తువులయొక్క సూక్ష్మత్వమును ఉపనేత్రము (సులోచనమనెడి దర్పణవిశేషము) వలన స్థూలత్వముగాఁ గనఁబడునట్లు, అజ్ఞాన ... ...

కాచభూమౌ జలత్వంవా జలభూమౌహి కాచతా, తద్వ ౨౨

తా. స్ఫటికభూమియందు జలత్వమును, జలభూమియందు స్ఫటికత్వమును గనఁబడునట్లు, అజ్ఞాన ... ... ... ...

యద్వదగ్నౌ మణిత్వంహి మణౌవా వహ్నితా పుమాన్, తద్వ.

తా. అగ్నియందు రత్నత్వమును, రత్నమునందు అగ్నిత్వమును పురుషునకుఁ గానంబడునట్లు, అజ్ఞానవశేము ... ... ... ...

అభ్రేషు సత్సుధావత్సు సోమోధావతి భాతి వై, తద్వ... ౨౪

తా. మేఘములు పోవుచుండఁగా చంద్రుఁడు పరుగెత్తుచున్నట్లు కనఁబడు లాగున, అజ్ఞాన ... ... ... ...

యత్రైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్, తద్వ... ౨౫

తా. ఒకనికి మోహమువలన దిగ్భ్రమము (దిక్కు ఇట్టిదని తెలియమి) కలుగునట్లు, అజ్ఞాన ... ... ... ...

యథా శశీ జలేభాతి చఞ్చలత్వేన కస్యచిత్, తద్వ... ౨౬

తా. ఒకనికి జలమునందు చంద్రుఁడు చంచలము కలదిగాఁ గానంబడునట్లు అజ్ఞాన ... ... ...

అవ. పైఁదఁ జెప్పఁబడిన అధ్యాసము ఆత్మజ్ఞానముచేత నివృత్తించునని రెండు శ్లోకములచేఁ జెప్పుచున్నారు.

ఏవమాత్మన్యవిద్యాతో దేహాధ్యాసో హి జాయతే,
ఏవమాత్మ పరిజ్ఞానా ల్లీయతేచ పరాత్మని. ౨౭

తా. ఇట్లు ఆత్మయందు అవిద్యచేత దేహాధ్యాసము కలుగుచున్నది. అదియే ఆత్మజ్ఞానముచేత పరమాత్మయందు లయమగుచున్నది.

సర్వమాత్మతయాజ్ఞాతం జగత్ స్థావరజఙ్గమమ్,
అభావా త్సర్వభావానాం దేహస్యచాత్మతాకుతః. ౨౮

తా. స్థావరజంగమాత్మకమైన ప్రపంచమంతయు ఆత్మగా తెలియఁబడుచున్నది. సకల భావములును లేకపోయినపుడు శరీరమునకు ఆత్మస్థితి యెక్కడిది? (అనఁగా లేదని యభిప్రాయము)

అవ. ఆత్మజ్ఞానోదయము కలుగుట కుపాయమును జెప్పుచున్నారు.

ఆత్మానం సతతం జానన్ కాలంనయ మహామతే,
ప్రారబ్ధ మఖిలం భుఞ్జన్ నోద్వేగం కర్తు మర్హసి. ౮౯

తా. మహామతీ! (నీవు) ఆత్మను నిరంతరమును దెలిసికొనుచు కాలమును గడపుచుందువుగాక. (అనంతరము) ప్రారబ్ధమంతయును అనుభవించువాఁడవై చిత్తక్షోభమును పొందకుందుము.

అవ. ప్రారబ్ధముయొక్కయు, తన్నివృత్తియొక్కయు, రహస్యమును నాలుగు శ్లోకములచేతఁ జెప్పుచున్నారు.

ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారబ్ధం నైవ ముఞ్చతి,
ఇతి యచ్ఛ్రూయతే శాస్త్రే తన్నిరాక్రియతేఽధునా. ౯౦

తా. ఆత్మజ్ఞానముకల్గినను ప్రారబ్ధము విడుచుటలేదని శాస్త్రములం దెయ్యది వినఁబడుచున్నదో, అది యిప్పుడు నిరాకరింపఁబడుచున్నది.

వి. సకల వ్యవహారకారణమైన అజ్ఞానము నివృత్తియైన మీఁద ప్రారబ్ధము లేదని భావము.

తత్త్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవ విద్యతే,
దేహాదీనా మసత్త్వాత్తు యథా స్వప్నో విబోధతః. ౯౧

తా. మేల్కాన్నతర్వాత కలలేనియట్లు తత్త్వజ్ఞానోదయమైన తర్వాత దేహాదులు అసత్తగుటవలన ప్రారబ్ధములేదు.

కర్మ జన్మాన్తరీయం య త్ప్రారబ్ధ మితికీర్తితమ్,
తత్తు జన్మాన్తరాభావాత్ పుంసోనై వాస్తికర్హిచిత్. ౯౨

తా. జన్మాంతరకర్మ మెయ్యదియో, అది ప్రారబ్ధ మనఁబడును. పురుషునకు జన్మాంతరము లేనందువలన అది కొంచెమైనను లేదు.

వి. 1 సంచిత, 2 ఆగామి, 3 ప్రారబ్ధ మని కర్మము త్రివిధము. 1 జన్మములకు కారణమైనది సంచితము. 2 వర్తమాన శరీరభోగముల నిమిత్తము చేయునది ఆగామి (క్రియ

మాణము). 3 వర్తమానశరీరమునకు కారణమైనది ప్రారబ్ధము. సంచితకర్మము రాఁగల శరీరముకొఱకే యైనను, అది రాఁగల శరీరమునకు ప్రారబ్ధ మగుటచేత, ఇచట జన్మాంతర మని చెప్పఁబడినది.

స్వప్నదేహో యథాఽధ్యస్త స్తథైవాయంహి దేహకః,
అధ్యస్తస్య కుతో జన్మ జన్మాభావేహి తత్కుతః. — 3

తా. స్వప్నదేహమువలె ఈదేహమును అధ్యస్థమై (కల్పింపఁబడినదై) యున్నది. అధ్యస్తమునకు జన్మ మెక్కడిది? జన్మము లేనపుడు ప్రారబ్ధ మెక్కడిది? (అనఁగా లేదని భావము.

అవ. దేహాది ప్రపంచము బ్రహ్మమునుండి కలిగినదని శ్రుతిప్రమాణము లుండుట వలన నెట్లు అధ్యస్థ మగునని యాశంకించి చెప్పుచున్నారు.

ఉపాదానం ప్రపఞ్చస్య మృద్భాణ్డస్యేవ కథ్యతే,
అజ్ఞానంచైవ వేదాన్తై స్తస్మిన్నష్టే క్వవిశ్వతా. — ౪

తా. భాండమునకు మృత్తికవలె ప్రపంచమునకు అజ్ఞానమును ఉపాదానమని వేదాంతములచేత చెప్పఁబడుచున్నది. అజ్ఞానమే నశించినయెడల ప్రపంచత్వ మెక్కడిది? (అనఁగా లేదని భావము).

వి. ఉత్పత్తి స్థితి లయములకుఁ గారణమైనది ఉపాదానము. ఉత్పత్తి మాత్రమునకుఁ గారణమైనది నిమిత్తము. చకారమువలన బ్రహ్మమే ఉపాదాన మని తాత్పర్యము.

అయినను, కేవలము బ్రహ్మము (నిర్వికారమై యుండుటవలన) జగత్కారణము కాదు. కేవలము అజ్ఞానము (జడమై యుండుటవలన) జగత్కారణము కాదు. కాఁబట్టి రెంటియొక్క చేరికచేతనే జగత్కారణ మగుచున్నది. "సత్యానృతే మిథునీకరోతి" "సత్యము అసత్యము అను నీరెంటిని చేర్చుచున్నాఁడు" అని శ్రుతిప్రమాణము.

మీఁదఁ జెప్పఁబడిన దృష్టాంతములందు జలస్థానమునందు బ్రహ్మము. అనఁగా మట్టిని పిండముచేయునట్టి శక్తికలది జలము. మృత్స్థానమునందు అజ్ఞానము. అనఁగా మఱఁగించు శక్తికలది మృత్తిక.

అవ. మూఢునకు ప్రపంచము సత్యముగా దోఁచునని దృష్టాంతముతోఁ జెప్పుచున్నారు.

యథారజ్జుం పరిత్యజ్య సర్పం గృహ్ణాతివై భ్రమాత్,
తద్వత్సత్య మవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః. — ౫

ఓమ్.

# ఈ శా వా స్యో ప ని ష త్

## ఆంధ్రటీకాతాత్పర్యసహితము.

### శంకరభాష్యావతారిక.

ఈశావాస్యమిత్యాదయోమన్త్రాః కర్మస్వవినియుక్తాః - తేషామకర్మశేషస్యాత్మనో యాథాత్మ్యప్రకాశకత్వాత్ యాథాత్మ్యంచాత్మనః శుద్ధత్వాపాపవిద్ధత్వైకత్వనిత్యత్వాశరీరత్వ సర్వగతత్వాదివక్ష్యమాణం. తచ్చకర్మణావిరుధ్యతఇతియుక్తఏవైషాంకర్మస్వవినియోగః. నహ్యేవంలక్షణమాత్మనోయాథాత్మ్యముత్పాద్యంవికార్యమాప్యంసంస్కార్యంవా-కర్తృభోక్తృవా-యేనకర్మశేషతాస్యాత్. సర్వాసాముపనిషదామాత్మయాథాత్మ్యనిరూపణేనైవోపక్షయాత్, గీతానాంమోక్షధర్మాణాంచైవంపరత్వాత్, తస్మాదాత్మనోఽనేకత్వకర్తృత్వభోక్తృత్వాది, చాశుద్ధత్వపాపవిద్ధత్వాది, చోపాదాయలోకబుద్ధిసిద్ధం కర్మాణి విహితాని. యోహికర్మఫలేనార్థీదృష్టేనబ్రహ్మవర్చసాదినా - అదృష్టేనస్వర్గాదినా, చ- ద్విజాతిరహంనకాణకుబ్జత్వాద్యనధికారప్రయోజకధర్మవానిత్యాత్మానంమన్యతే - సోఽధిక్రియతేకర్మస్వితిహిఅధికారవిదోవదన్తి. తస్మాదేతేమన్త్రాః ఆత్మనోయాథాత్మ్యప్రకాశనేనాత్మవిషయంస్వాభావికకర్మవిజ్ఞానంనివర్తయన్తఃశోకమోహాది సంసారధర్మవిచ్ఛిత్తిసాధనమాత్మైకత్వాది విజ్ఞానముత్పాదయన్తీతి.

అవతారిక.—ఈశావాస్యము మొదలగు వేదమంత్రములు కర్మమునందు వినియోగింపఁబడినవి కావు; అవి కర్మసాధనము గాని ఆత్మయొక్క యథార్థస్థితిని బోధించుచున్నవి. ఆత్మయొక్క యథార్థస్థితియైన నిజస్వరూపము శుద్ధమైనదియును, పాపమునకు సంబంధపడనిదియును, ఏకత్వమును, నిత్యత్వమును, శరీరరహితమైనదియును, సర్వత్రవ్యాపించినదియును, అనునవి మొదలగు లక్షణములతోఁ గూడినదని యిఁకముందు చెప్పఁబడును. అదియు కర్మమునకు విరోధముగ నున్నది. కనుక ఈ మంత్రములకు కర్మమునందు వినియోగము (సంబంధము) లేదనుట యుక్తమే యగును. ఈ (మును చెప్పఁబడిన) లక్షణములతోఁగూడిన ఆత్మయొక్క యథార్థస్థితి ఉత్పాద్యముగా

(ఉత్పత్తియగునట్టిదిగా) నైనను, వికార్యముగా (వికారము నొందఁదగినట్టిదిగా) నైనను, ఆప్యముగా (పొందఁదగినదిగా) నైనను, సంస్కార్యముగా (సంస్కారముచేయఁదగినదిగా) నైనను, కర్తగానైనను, భోక్తగానైనను ఉండునెడల, ఆత్మ కర్మకు అంగమగును. ఆత్మయొక్క నిజస్వరూపము అట్టిదికాదు కనుక, ఆత్మ కర్మకు సాధనముకాదు. మఱియు సకలోపనిషత్తులును ఆత్మస్వరూపమును నిరూపించుటవలనను, భగవద్గీత మొదలగు మోక్షశాస్త్రగ్రంథములలోఁ జెప్పఁబడిన మోక్షధర్మములన్నియు ఆత్మస్వభావమును గుఱించినవిగ నుండుటవలనను, ఆత్మయొక్క నిజస్వరూపము కర్మసాధనమైనదికాదు. కాఁబట్టి ఆత్మయొక్క కర్తృత్వభోక్తృత్వాదులను, అశుద్ధత్వము, పాపత్వముతోఁగూడిన స్థితి, మొదలగునవియును గ్రహించి లోకులయొక్క బుద్ధిచే సిద్ధించిన కర్మములు విధింపఁబడియున్నవి. ఎవఁడు బ్రహ్మతేజస్సు మొదలగువానియొక్క దృష్టమును, స్వర్గాదులు మొదలగువానియొక్క అదృష్టమును, అగు కర్మఫలమును గోరుచున్నాఁడో, నేను బ్రాహ్మణుఁడను, నేను ఒంటికంటివాఁడను, నేను కుంటివాఁడను, అను నీ మొదలగు అనధికారధర్మములు కలవాఁడను కాను, అని తన్ను భావించుచున్నాఁడో, వాఁడు కర్మాధికారి యగుచున్నాఁడు. ఇట్లు కర్మాధికారము నెఱింగినవారు (జైమిని మొదలగువారు) చెప్పుచున్నారు. కావున ఈ మంత్రములు ఆత్మయొక్క నిజస్వరూపమును దెలియఁజేయుటచేత ఆత్మను విషయము చేయునట్టి స్వభావముగల అజ్ఞానమును నివృత్తిచేయునవియై శోకమోహాది సంసారమును నాశము చేయుటకు సాధనమైన ఆత్మైకత్వాది విజ్ఞానమును కలుగఁజేయునవి యై యున్నవి.

హ:॥ ఓమ్. ఈశావాస్య మిదగ్ సర్వం యత్కించ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథా మాగృధః కస్య స్విద్ధనమ్. ౧

టీక. జగత్యాం= భూమియందు (బ్రహ్మాండమునందు), యత్కించ=ఏదైన, ఇదం సర్వం=ఈసమస్తమగు, జగత్=లోకము, ఈశా =ఈశ్వరునిచేత (పరమాత్మచేత), వాస్యం=వ్యాప్తమైనది, తేన=అట్టి, త్యక్తేన= త్యాగముచేత, (ఆత్మానం=ఆత్మను), భుఞ్జీథాః=పరిపాలించుమా ! కస్యస్విత్ =ఎవనియొక్క, ధనం=ధనమును, మాగృధః= కోరకుమా !

తా.—నామరూపవికారాత్మకమగు ఈసమస్త ప్రపంచము ఈశ్వరునిచేత వ్యాప్తమైయున్నదని ఈశ్వరభావన చేయుటచేత, నామరూపాది సర్వవికారమును విడువఁబడుచున్నది. ఇట్టిభావనతోఁ గూడియున్నవానికి సన్న్యాసమందే అధికారము. ఇట్టిసన్న్యాసి

సముచేత ఆత్మను పాలించుకొనుమనియును, నీసంబంధమైనదియు ఇతరసంబంధమైనదియు నగు ధనమును కోరకుమనియును, ఆత్మజ్ఞానికి ఈమంత్రము తత్త్వమును ఉపదేశించి, సర్వకర్మసన్న్యాసపూర్వకమైన జ్ఞాననిష్ఠచేత ఆత్మస్వరూపమును రక్షించుకొనందగినదనియును బోధించుచున్నది.

## శంకరభాష్యము.

ఏవముక్తాభిధేయసమ్బన్ధప్రయోజనాన్మన్త్రాన్సఙ్క్షేపతో వ్యాఖ్యాస్యామః. ఈశా-ఈష్టే ఇతి, ఈట్-తేన ఈశా. ఈశితా పరమేశ్వరః పరమాత్మాసర్వస్య-సహిసర్వమీష్టే సర్వజన్తూనామాత్మాసన్. తేన స్వేనాత్మనేశావాస్యం-ఆచ్ఛాదనీయం కిం. [ఇదంసర్వం] యత్కించ-యత్కించిజ్జగత్యాం-పృథివ్యాంజగత్సర్వం. స్వేనాత్మనా అహమేవేదంసర్వమితి పరమార్థ సత్యరూపేణానృతమిదంసర్వంచరాచరమాచ్ఛాదనీయం పరమాత్మనా. యథా చన్దనాగర్వాదేరుదకాదిసమ్బన్ధజక్లేదాదిజం దౌర్గన్ధ్యంతత్స్వరూపనిఘర్షణేనాచ్ఛాద్యతే స్వేనపారమార్థికేన-గన్ధేన తద్వదేవహి స్వాత్మన్యధ్యస్తం స్వాభావికం కర్తృత్వభోక్తృత్వాదిలక్షణంజగద్ద్వైతరూపంపృథివ్యాం. జగత్యామిత్యుపలక్షణార్థత్వాత్సర్వమేవ నామరూపకర్మాఖ్యం వికారజాతం పరమార్థసత్యాత్మభావనయాత్యక్తంస్యాత్. ఏవమీశ్వరాత్మభావనయాయుక్తస్యపుత్రాద్యేషణాత్రయసన్న్యాసే ఏవాధికారః-నకర్మసు. తేనత్యక్తేన-త్యాగేనేత్యర్థః. నహిత్యక్తోమృతఃపుత్రోభృత్యోవాఆత్మసంబన్ధితయాఽభావాదాత్మానంపాలయతి-అతస్త్యాగేనేత్యయమేవార్థః. భుఞ్జీథాః- పాలయేథాః. ఏవంత్యక్తైషణస్త్వంమాగృధః-గృధిం -ఆకాఙ్క్షాంమాకార్షీః ధనవిషయాం. కస్యస్విత్-కస్యచిత్. పరస్య స్వస్యవాధనం మాకాఙ్క్షీరిత్యర్థః. స్విదిత్యనర్థకోనిపాతః. అథవా-మాగృధః.కస్మాత్. కస్యస్విద్ధనమిత్యాక్షేపార్థః. నకస్యచిద్ధనమస్తి-యద్గృధ్యేత. ఆత్మైవసర్వమితీశ్వరభావనయా సర్వంత్యక్తం-అతఆత్మనఏవేదంసర్వ, మాత్మైవచసర్వం - అతోమిథ్యావిషయాం గృధింమాకార్షీరిత్యర్థః. ... ... ... ౧

అవతారిక.—ఇట్లు ఆత్మజ్ఞానియైనవాఁడు పుత్త్రుఁడు ధనము ఉత్తమలోకము అను నీమూఁటియొక్క కోరికను త్యాగముచేసి ఆత్మజ్ఞాననిష్ఠుఁడైయుండి ఆత్మను రక్షింపవలయుననెడి యీవేదముయొక్క అర్థము మొదటి మంత్రమునందు చెప్పఁబడినది. ఎవనికి ఆత్మజ్ఞానము లేదో, ఎవనికి ఆత్మయే ఈ సకలప్రపంచమని భావించుటకు శక్తిలేదో, వానికి చిత్తశుద్ధికొఱకు ఈమంత్రము కర్మమును ఉపదేశించుచున్నది.

కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః ।
ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే ॥ 2

టీ. ఇహ = ఈలోకమునందు, కర్మాణి = అగ్నిహోత్రాదికర్మలను, కుర్వన్నేవ = చేయుచునే, శతంసమాః = నూఱుసంవత్సరములు, జిజీవిషేత్ = జీవింప నిచ్ఛయించ వలయును. ఏవం = ఈప్రకారముకోరెడి, నరే = మనుష్యుఁడవగు, త్వయి = నీకు, ఇతః = ఈ అగ్నిహోత్రాదికర్మను చేయుటకంటె, (యేన = ఏప్రకారముచేత), కర్మ = అగ్నిహోత్రాదికర్మః నలిప్యతే = బంధింపదో, (అట్టిది), అన్యథా = మఱియొకటి, నాస్తి = లేదు.

తా. ఈరెండవమంత్రము పూర్వమందు చెప్పిన ఆత్మతత్త్వమును తెలిసికొనుటకు అశక్తుఁడవగు నీవు పురుషాయుః ప్రమాణమైన నూఱుసంవత్సరములు శాస్త్రోక్తమైనకర్మలను ఏవిధముగా చేసినచో బద్ధుఁడవుకావో, ఆవిధముగాఁజేయు మనియును, ఇంతకంటె నీకు శుభమైన ఇంకొకమార్గము లేదనియును, అజ్ఞానికి బోధించుచున్నది.

శం.— ఏవమాత్మవిదః పుత్రాద్యేషణాత్రయసన్న్యాసేనాత్మజ్ఞాననిష్ఠతయాత్మా రక్షితవ్య ఇత్యేష వేదార్థః. అథేతరస్యానాత్మజ్ఞతయాత్మగ్రహణాశక్తస్యేదముపదిశతి మన్త్రః - కుర్వన్నేవేహ - నిర్వర్తయన్నేవ కర్మాణి - అగ్నిహోత్రాదీని - జిజీవిషేత్ - జీవితుమిచ్ఛేత్. శతం-శతసఙ్ఖ్యాకాః సమాః-సంవత్సరాన్. తావద్ధి పురుషస్య పరమాయుర్నిరూపితం. తథా ప్రాప్తానువాదేన - యజ్జిజీవిషేచ్ఛతం వర్షాణి - తత్కుర్వన్నేవ కర్మాణీత్యేతద్విధీయతే. ఏవం-ఏవంప్రకారాదన్యథేతో నాస్తి. యేనప్రకారేణాశుభం కర్మ న లిప్యతే - కర్మణా న లిప్యస ఇత్యర్థః-అతః శాస్త్రవిహితాని కర్మాణ్యగ్నిహోత్రాదీని కుర్వన్నేవ జిజీవిషేత్. కథం పునరిదమవగమ్యతే - పూర్వేణ మన్త్రేణ సన్న్యాసినో జ్ఞాననిష్ఠోక్తా-ద్వితీయేన తదశక్తస్య కర్మనిష్ఠేతి. ఉచ్యతే - జ్ఞానకర్మణోర్విరోధం పర్వతవదకమ్ప్యం యథోక్తం న స్మరసి కిం. ఇహాప్యుక్తం యో హి జిజీవిషేత్ స కర్మ కుర్వన్, ఈశావాస్యమిదం సర్వం తేన త్యక్తేన భుఞ్జీథా మా గృధః కస్యస్విద్ధనమితి, * న జీవితే మరణే వా గృధిం కుర్వీతారణ్యమియాదితి తతో న పునరేయాదితి చ సన్న్యాసశాసనాత్. ఉభయోః ఫలభేదం చ వక్ష్యతి. * ఇమౌ ద్వావేవ పన్థానావనునిష్క్రాన్తతరౌ భవతః క్రియాపథశ్చైవ పురస్తాత్సన్న్యాసశ్చ తయోః సన్న్యాస ఏవాతిరేచయతి న్యాస ఏవాత్యరేచయదితి తైత్తిరీయకే. * ద్వావిమావథ పన్థానౌ యత్ర వేదాః ప్రతిష్ఠితాః ప్రవృత్తిలక్షణో ధర్మో నివృత్తౌ చ విభావిత ఇత్యాది

పుత్రాత్రియవిచార్యనిశ్చితముక్తం వ్యాసేనవేదాచార్యేణభగవతా. విభాగంచానయోర్వక్ష్యామః. ... ... ... 2

అవతారిక.—ఇప్పుడు అజ్ఞానులను నిందించుటకొఱకు ఈ మంత్రము ప్రారంభింపఁబడుచున్నది.

అసుర్యానామ తే లోకా అన్ధేనతమసావృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కేచాత్మహనోజనాః. 3

టీ. అసుర్యాఃనామ=అసురములనుప్రసిద్ధములగు దేవాదిజన్మములు,[యే=ఏవియో] తే=అట్టి, లోకాః=కర్మఫలమును అనుభవించెడి జన్మములు, అన్ధేన=అజ్ఞానరూపమగు [గాఢమగు]తమసా = [అజ్ఞానమనెడి] చీఁకటిచేత, ఆవృతాః= కప్పఁబడినవో [అట్టి] ఆత్మహనః=ఆత్మహంతకులగు, జనాః=జనులు, యేకేచ=ఎవరెవరో, తే=వారు, ప్రేత్య= మరణమునుపొంది, తాన్=దేవాదిస్థావరాంతమువఱకునుండెడి జన్మములను, అభిగచ్ఛన్తి= పొందుచున్నారు.

తా. అజ్ఞానులగువారు ఈదేహమునువిడిచినపిమ్మట అజ్ఞానముచేత కప్పఁబడియుండెడి దేవాదిస్థావరాంతమువఱకుఁగల జన్మములను వారివారికర్మానుసారముగ పొందుచున్నారని ఈమూఁడవమంత్రము అజ్ఞాననింద చేయుచున్నది.

శం.—అథేదానీమవిద్వన్నిన్దార్థోయంమన్త్రఆరభ్యతే — అసుర్యాః — పరమాత్మభావమద్వయమపేక్ష్యదేవాదయోప్యసురాః. తేషాంచ స్వభూతాః అసుర్యాః. నామ శబ్దోఽనర్థకో నిపాతః. తేలోకాః—కర్మఫలానిలోక్యన్తే—దృశ్యన్తే—భుజ్యన్తఇతి జన్మాని. అన్ధేన—అదర్శనాత్మకేనాజ్ఞానేనతమసాఆవృతాః —ఆచ్ఛాదితాః. తాన్—స్థావరాన్తాన్ ప్రేత్య-త్యక్త్వేమందేహం—అభిగచ్ఛన్తియథాకర్మ యథాశ్రుతం. (పరమాత్మనఃజ్ఞ) ఆత్మానంఘ్నన్తీతిఆత్మహనః. కేతే. యేఽవిద్వాంసః. కథం. తేఆత్మానంనిత్యంహింసన్తి — అవిద్యాదోషేణవిద్యమానస్యాత్మనస్తిరస్కరణాత్. విద్యమానస్యాత్మనో యత్కార్యం ఫలమజరామరత్వాదిసంవేదనాదిలక్షణం — తద్ధతస్యేవతిరోభూతంభవతీతి ప్రాకృతా అవిద్వాంసోజనాఆత్మహనఉచ్యన్తే. తేనహ్యాత్మహననదోషేణసంసరన్తితే. ... 3

అవతారిక.—ఏయాత్మను చంపుటవలన అజ్ఞానులు జననమరణరూపసంసారమును బొందెదరో, దీనికి విపరీతమైన జ్ఞానమువలన ఆత్మను చంపనిజ్ఞానులు సంసారబంధము నుండి విడువంబడినవారై ముక్తులయ్యెదరో, ఆయాత్మతత్త్వము ఎట్టిదనుటను ఈ మంత్రమునందు చెప్పఁబడుచున్నది.

అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్
తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి. ౪

టీ. అనేజత్=తనస్థితినుండి చలింపని, ఏకం=రెండవదిలేని (భేదములేని), మనసః=మనస్సుకంటె, జవీయః=వేగముగల, (మనసః = వేగముగలమనస్సుకంటె), పూర్వం=ముందే, అర్షత్=పొందియున్న, ఏనత్=ఈప్రకృతమందు చెప్పియుండెడి ఆత్మను, దేవాః = ప్రకాశస్వరూపములగు ఇంద్రియములు, నాప్నువన్=పొందనివాయెను. తత్=ఆయాత్మ, ధావతః=పరుగెత్తుచున్న, అన్యాన్=ఆత్మభిన్నములగుమనోవాగాదీంద్రియములను, అత్యేతి=అతిక్రమించినట్లేయున్నది. తస్మిన్=ఆయాత్మస్వరూపమందు, తిష్ఠత్=ఉన్న, మాతరిశ్వా=వాయువు, అపః=ప్రాణులయొక్క చేష్టారూపములగు కర్మలను, దధాతి=వేఱుపఱుచుచున్నది (ధరించుచున్నది).

తా. అజ్ఞానులు ఏ యాత్మతత్త్వమును తెలిసికొనక పోవుటచేత జననమరణరూపసంసారమును పొందుచున్నారో, జ్ఞానులు ఏయాత్మతత్త్వమును తెలిసికొనుటచేత జననమరణరూపసంసారమును విడిచి ముక్తులగుచున్నారో, అట్టి ఆత్మతత్త్వము ఈ మంత్రముచేత చెప్పఁబడుచున్నది. ప్రకృతమందు చెప్పియుండెడి ఆత్మతత్త్వము చలింపనిదై రెండవవస్తువులేక పరిపూర్ణమై యున్నది. కావుననే మనస్సు అతివేగముతో వ్యాపించుటకు పూర్వమే ఆ యాస్థలములయందంతయు ముందుగా తాను (ఆత్మ) నిండియున్నదగుటచేత మనోవేగముకంటె అధికమైనవేగము కలిగియున్నది. ఇట్టి ఆత్మతత్త్వమును ఇంద్రియములు చూడలేవు. ఆత్మ తన్ను గుఱించి అతివేగముతో పరుగెత్తిపోవునట్టి తనకంటె వేఱైన యింద్రియములనుగుఱించి చలింపనిదైయుండియు అజ్ఞానులకు చలించుచున్నట్లే యున్నది. ఎట్లు నూలు వస్త్రమునందుపడుగుపేకలై వస్త్రరూపముగుచు ఆధారాధేయమైయున్నదో, అట్లు ఆత్మతత్త్వమందు సమస్తప్రపంచమునకు శరీరేంద్రియరూపమై సర్వము తానైయుండెడి సూత్రాత్మరూపమైన ప్రాణమగు వాయువు జీవులయొక్క కర్మలను గుఱించి అగ్న్యాదిత్యాదులయొక్క జ్వలనప్రకాశాదికార్యములను విభజించుచు ధరించుచు నున్నదని ఈ మంత్రము బోధించుచున్నది.

శం.—యస్యాత్మనో హననాదవిద్వాంసః సంసరన్తి, తద్విపర్యయేణ విద్వాంసో ముచ్యన్తే - తేఽనాత్మహనః. తత్కీదృశమాత్మతత్త్వమితి. ఉచ్యతే - అనేజత్. *ఏజృ కమ్పనే. కమ్పనం-చలనం. స్థిరత్వప్రచ్యుతిః. తద్వర్జితం. సర్వదా ఏకరూపమిత్యర్థః.

తచ్చైకం సర్వభూతేషు. మనసః - సఙ్కల్పాదిలక్షణాత్ జవీయః-జవవత్తరం. కథం విరుద్ధముచ్యతే - ధ్రువం నిశ్చలమిదం మనసో జవీయ ఇతి చ. నైష దోషః - నిరుపాధ్యుపాధిమత్త్వోపపత్తేః. తత్ర నిరుపాధికేన రూపేణోచ్యతే అనేజదేకమితి. మనసోఽన్తఃకరణస్య సఙ్కల్పవికల్పలక్షణస్యోపాధేరనువర్తనాత్. ఇహ దేహస్థస్య మనసో బ్రహ్మలోకాదిదూరస్థసఙ్కల్పనం క్షణమాత్రాద్భవతీత్యతో మనో జవిష్ఠం లోకే ప్రసిద్ధం. తస్మిన్మనసి బ్రహ్మలోకాదీన్ ద్రుతం గచ్ఛతి సతి ప్రథమం ప్రాప్త ఇవాత్మచైతన్యాభాసో గృహ్యతే - అతో మనసో జవీయ ఇత్యాహ. (నైనద్దేవాః) ద్యోతనాద్దేవాః - చక్షురాదీనీన్ద్రియాణి ఏనత్ - ప్రకృతమాత్మతత్త్వం నాప్నువన్ - న ప్రాప్తవన్తః. తేభ్యో మనో జవీయః - మనోవ్యాపారవ్యవహితత్వాత్ - ఆభాసమాత్రమప్యాత్మనో నైవ దేవానాం విషయీభవతి. యస్మాజ్జవనాన్మనసోఽపి పూర్వమర్షత్ - పూర్వమేవ గతం. వ్యోమవద్వ్యాపిత్వాత్. సర్వవ్యాపి తదాత్మతత్త్వం సర్వసంసారధర్మవర్జితం స్వేన నిరుపాధికేన స్వరూపేణావిక్రియమేవ సదుపాధికృతాః సర్వాః సంసారవిక్రియాః అనుభవతీవావివేకినాం మూఢానామనేకమివ చ ప్రతిదేహం ప్రత్యవభాసత ఇత్యేతదాహ - తద్ధావతః - ద్రుతం గచ్ఛతోఽన్యాన్ - మనో వాగిన్ద్రియప్రభృతీనాత్మవిలక్షణాన్ అత్యేతి - అతీత్య గచ్ఛతీవ. ఇవార్థం స్వయమేవ దర్శయతి (తిష్ఠదితి) స్వయమవిక్రియమేవ సదిత్యర్థః. తస్మిన్ - ఆత్మతత్త్వే సతి నిత్యచైతన్యస్వభావే. మాతరిశ్వా - మాతరి - అన్తరిక్షే శ్వయతి - గచ్ఛతీతి వాయుః సర్వప్రాణభృత్ క్రియాత్మకః. యదాశ్రయాణి కార్యకరణజాతాని - యస్మిన్నోతాని ప్రోతాని చ - యత్సూత్రసంజ్ఞకం సర్వస్య జగతో విధారయితృ - స మాతరిశ్వా. అపః - కర్మాణి ప్రాణినాం చేష్టాలక్షణాని, అగ్న్యాదిత్యాదీనాం జ్వలనదహనప్రకాశాభివర్షణాదిలక్షణాని, దధాతి - విభజతీత్యర్థః. ధారయతీతి వా. * భీషాఽస్మాద్వాతః పవతే ఇత్యాదిశ్రుతిభ్యః. సర్వా హి కార్యకారణాదివిక్రియా నిత్యచైతన్యాత్మస్వరూపే సర్వాస్పదభూతే సత్యేవ భవన్తీత్యర్థః. ... ౪

అవ.—పూర్వమంత్రమునందుఁ జెప్పఁబడిన యభిప్రాయమునే యీమంత్రమును బోధించుచున్నది. ఏలన, ఆవిషయమునందే ప్రవృత్తి కలుగవలయునని మరల దానినే చెప్పుచున్నారు.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే ।
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః. ౫

టీ. (యత్ = ఏ ఆత్మతత్త్వము, ప్రకృతం = ప్రస్తుతముగాఁ జెప్పఁబడినదియో), తత్ = ఆ ఆత్మతత్త్వము, ఏజతి = చలించుచున్నది. తత్ = ఆ ఆత్మతత్త్వము, నైజతి = చలింపదు

టీ. తత్=ఆ ఆత్మతత్త్వము, (అవిదుషాం=అజ్ఞానులకు,) దూరే = దూరమందును, తద్వత్=ఆప్రకారముగానే, (విదుషాం=జ్ఞానులకు), అన్తికే=సమీపమునందును, తత్=ఆ ఆత్మతత్త్వము, అస్య=ఈ, సర్వస్య=సమస్తజగత్తునకు, అన్తః=మధ్యమందును, తదు=ఆ ఆత్మతత్త్వమే, అస్య = ఈ, సర్వస్య=సమస్తజగత్తునకు, బాహ్యతః = వెలుపలను, [అస్తి=కలదు.]

తా. ఇప్పుడు చెప్పఁబడెడి ఆ యాత్మతత్త్వము తాను చలింపనిదై యుండియు, ఎట్లు అజ్ఞానులకు చలించుచున్నట్లుగను, దూరమందున్నట్లుగను తోఁచుచున్నదో, అట్లే జ్ఞానులకు సమీపమందున్నట్లుగను, సర్వప్రపంచమునకు లోపలను వెలుపలను ఆకాశమువలె వ్యవధిలేక నిండియున్నట్లును తోఁచుచున్నదని ఈ మంత్రము బోధించుచున్నది.

శం.—నమన్త్రాణాం జామితాస్తీతి పూర్వమన్త్రోక్తమప్యర్థం పునరాహ - తత్ - ఆత్మతత్త్వం. యత్ప్రకృతం. ఏజతి - చలతి. తదేవ చ నైజతి - స్వతో నైవ చలతి. అచలమేవ సచ్చలతీవేత్యర్థః. కించ - తద్దూరే - వర్షకోటిశతైరప్యవిదుషామప్రాప్యత్వాద్దూర ఇవ. తద్వన్తికే - సమీపే అత్యన్తమేవ విదుషాం. ఆత్మత్వాత్. న కేవలం దూరే అన్తికే చ. తదన్తరే - అభ్యన్తరే అస్య సర్వస్య. * ఆత్మా సర్వాన్తర ఇతి శ్రుతేః. అస్య సర్వస్య - జగతో నామరూపక్రియాత్మకస్య తదు సర్వస్యాస్య బాహ్యతః - వ్యాపిత్వాత్ - ఆకాశవన్నిరతిశయసూక్ష్మత్వాదన్తః. * ప్రజ్ఞానఘన ఏవేతి శాసనాన్నిరన్తరం. ... ౫

అవ.—పూర్వోక్తాత్మతారక నిట ననుసంధించునది.

యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవానుపశ్యతి
సర్వభూతేషు చాత్మానం తతో నవిజుగుప్సతే. ౬

టీ. యస్తు=ఏజ్ఞాని, సర్వాణి = సమస్తములైన, భూతాని=భూతములను, ఆత్మన్యేవ=ఆత్మయందే, అనుపశ్యతి=చూచుచున్నాఁడో, సర్వభూతేషు చ=సమస్తభూతములయందును, ఆత్మానం = ఆత్మను (తనను), అనుపశ్యతి = చూచుచున్నాఁడో, (సః=ఆజ్ఞాని), తతః=ఆప్రకారము చూచుటవలన, నవిజుగుప్సతే = నిందించుటలేదు.

తా. అట్టి ఆత్మతత్త్వమును తెలిసికొనియుండెడి ఏజ్ఞాని సర్వభూతములను తనయందును, సర్వభూతములయందు తన్నును, చూచుచున్నాఁడో, వాఁడు అట్లు చూచుటచేత సర్వము ఆత్మస్వరూపమగుటవలన, నిందచేయఁడని ఈ మంత్రము బోధించుచున్నది.

జ్యోతిషికు లున్న చోటమాత్రము పెక్కురుగూడి ప్రశ్నల నడుగుచుండిరి. మొగలాయిపాదుషాహాలకాలమున జ్యోతిష్కులకు అధికగౌరవము కలదు. ఆకాలమున జ్యోతిషమునందు ప్రజల కధికాసక్తి కల్గియుండెను. అయినను ఔరంగజేబు కనిష్ఠపుత్త్రుఁడైన అక్బరు జ్యోతిష్కుల మాటను నమ్మి మంచిదినమున యుద్ధమునకు బైలుదేరవలయు నని యెంచి ఆలస్యము చేయుచుండుటను దెలిసికొన్న ఔరంగజేబు తనబుద్ధి బలముచేత అక్బరు ప్రయత్నమును విఫలము చేసినాఁడు.

డిల్లిలో చాందినీచౌకునందు జ్యోతిషికుఁడు తన యెదుటనున్న పీఁటపై పుస్తకమునుంచికొని చిత్రాసనమునఁ గూర్చుండి యుండెను. నూర్లకొలఁది స్త్రీలు వానిం బరివేష్టించి తమతమ యదృష్ట మేలాగున్నదో చెప్పవలయు నని యాతురపడి యడుగుచుండిరి. కొందఱు దూరదూరముగఁ గూరుచుండి సమయము నెదురుచూచుచుండిరి. రాణివాసము వారు సైతము లజ్జలేక తమభాగ్య మెట్లున్నదో తెలిసికొనవలయు ననెడి కుతూహలముతో వానియొద్దఁ జేరి యడుగుచుండిరి. అచ్చట అవగుంఠనవతియైన యొకయువతి అట్టిట్టు తిరుగుచుండెను. దానికి జ్యోతిష్కుని సమీపమునకుఁ బోవుట కిష్టము ; అయినను అవకాశము దొరకలేదు. ఆసమయమున నొకఁడు గుఱ్ఱము నెక్కి పోవుచుండెను.

ఆతురగారూఢుఁడు యువకుఁడుగ నుండెను. వాఁడు మొగలాయి వంశస్థుఁ డని తోఁచినది. వాఁడు సుందరపురుషుఁడు. వాని వస్త్రములు యథాయోగ్యముగ నుండినవి. వానిని చూచినంతనే గొప్పకుటుంబమున జన్మించినవాఁ డని తోఁచెను. వానిగుఱ్ఱమును మంచిజాతి గుఱ్ఱముగ నుండెను. జనస్తోమ మగుటంబట్టి వాఁడు గుఱ్ఱమును మెల్లగా నడిపించికొని పోవుచుండెను. అట్టిట్టు చూచుచున్న యువతి వానినిచూడఁగానే వేగముగఁబోయి లగామునుబట్టి నిలిపి ఖాన్ సాహేబుగారు ముబారక సాహేబులవారు కదా ? అనెను.

ముబారక—నీ వెవరు?

యువతి—ఏ అల్లా! నన్ను మఱచితివా?

ముబారక—దరియా కాదా?

దరియ—ఔను.

ముబారక—ఇక్కడి కేల వచ్చితివి?

దరియ—నే నెచ్చోటికిని పోవుదానను, నీ యాక్షేపణ యేమియు లేదు కదా?

ముబారక—నీ వెచ్చటికిపోయిన నా కేమి? నీవు నాదానవు కావు కదా? నీ కేమేని కావలసినచో అడుగుము.

దరియా చెవులుమూసికొని—నీ ధనము నా కేల? అది హారాం (దోషము).

ముబారక—అట్లయినచో నీవు నన్నేల నిల్పితివి?

దరియాబీబి దిగినచోఁ జెప్పెద ననెను. ముబారకుఁడు గుఱ్ఱము నుండి దిగి దరియనుజూచి చెప్పు మనెను.

దరియ—ఈగుంపునడుమ జ్యోతిష్కుఁడొకఁడు కూర్చుండియున్నాఁడు. వాఁడీయూరికి క్రొత్తవాఁడు. ఫలము చక్కఁగాఁ జెప్పుచున్నాఁడట. నీచేతిని వానికి చూపుము.

ముబారక—నాఫలముతో నీ కేమిపని? నీవు చూపుము.

దరియ—నాదిచూపి ప్రయోజనము లేదు. నీది చూపుటవలన ఫలము కలదు.

అని చెప్పి దరియాబీబి వానిచేయిపట్టి లాగికొనిపోయెను.

ముబారకుఁడు, నాగుఱ్ఱమును పట్టుకొనుట కెవ్వరును లేరు. నేను దానిని చెట్టునకుఁ గట్టివచ్చెద, అని చెప్పి, దానిచేతిపట్టును వదలించికొని పోయి గుఱ్ఱమును చెట్టున గట్టి మఱలి వచ్చెను.

ముబారకుండు జ్యోతిష్కునియొద్ద కేఁగునప్పుడు సందేలును దాని విడిచిపెట్టిరి. వాని వెంట దరియాబీబియు పోయెను. ముబారకుండు జ్యోతిష్కునకు చేతిని చూపెను. వాఁడు చాలసేపుచూచి యేదో చెప్పి, పిదప, 'మీరుపోయి పెండ్లిచేసికొనుఁడు' అనెను.

అచ్చటనే చాటున నిలిచియున్న దరియాబీబి 'పెండ్లియైనది' అనెను.

జ్యోతిష్కుఁడు—ఆమాట చెప్పిపోవారెవరు?

ముబారక—అది యొకపిచ్చిది, దానిమాటతో పనియేమి? నా కెట్టి యువతి భార్యకాఁగలదు? చెప్పెదరా?

జ్యోతిష్కుఁడు—మీరొక రాజపుత్రిని పరిణయింతురు.

ముబారక—అందువలన లాభమేమి?

జ్యోతిష్కుఁడు—గొప్పయుద్యోగము లభించును.

ఆచోటనున్న దరియాబీబి, యుద్యోగముతోఁగూడ మృత్యువును లభించును, అనినది.

జ్యోతిష్కుఁడు—ఎవ రీమాట చెప్పినది?

ముబారక—అది పిచ్చిది.

జ్యోతిష్కుఁడు—అది పిచ్చిదికాదు. ఇఁక నేనేమియుఁ జెప్పను. పొండు, అనెను.

ముబారకున కేదియు బోధపడలేదు. జ్యోతిష్కునకు సంభావన మిచ్చి, దరియాబీబిని పిలిచెను. అది పలుకలేదు. పిదప నలుదెసల పరికించిచూచెను. అది కనఁబడలేదు. అంతట వాఁడు పిసప్పుడే గుఱ్ఱము నెక్కి కోటవైపు వెడలిపోయెను.

---

## 7. జేబ ఉన్నీసా.

దరియాబీబి సమాచారవిక్రయ మే మాయెను? సమాచారము నెవరికి విక్రయించుట ? ఈవిషయమును దెలిసికొనుటకు మున్ను మొగలాయిచక్రవర్తియొక్క అంతఃపుర పరిచయము నొకింత తెలిసికొనవలయును.

భారతవర్ష స్త్రీలు రాజ్యశాసనమునందు సమర్థు లని పేర్కొనం బడియున్నారు. పశ్చిమఖండమునందు జినోబియా, ఇసబెలా, ఎలిజబెత్, కెథరైన్ అను యువతులు మాత్రమే కలరు. భరతఖండమునందన్ననో పలువురు రాజకుల జారలు కలరు. మొగల్ సమ్రాట్ కన్యక లెల్ల రీవిషయమునందు దక్షులు. అయినను, వారు రాజనీతియం దెంతటి నైపుణికలవారో అంతటి భోగపరాయణలు. ఔరంగజీబునకు జహానార్, రోషనార్ అను నిర్వురు తోఁబుట్టువులు కలరు. జాహానార్ అనునది షాహజహానునికి ప్రధాన సహాయకురాలు. షాహజహాన్ దానితో నాలోచింపక యేకార్యమును జేయువాఁడు కాఁడు. దానిమాట చొప్పున వర్తించి కీర్తికాముఁ డాయెను. వాఁడు తండ్రికి హితుఁడై యుండెను. అయినను వాఁ డెంతటి పరిమాణగుణవిశిష్టతచే కార్యదక్షుఁడని పేర్కొనఁ బడుచుండినాఁడో అంతకంటె నెక్కువ పరిమాణముగల యింద్రియ లోలుఁడునై యుండినాఁడు. ఇంద్రియ పరితృప్తికై లెక్కలేని జనులు వాని యనుగ్రహమునకుఁ బాత్రులై యుండిరి. వారిపేర్ల నెల్ల యూరోపియన్ యాత్రికులు వర్ణించియున్నారు. అయినను మేము ఆచెడ్డ పెలపేర్లను వ్రాయుటకు సాహసింపము.

రోషనార్, తండ్రిని విరోధించి ఔరంగజీబుపక్షము నవలంబించి యుండినది. ఇద్దియు జాహానార్ వలె రాజనీతివిశారదయై యుండినది. ఇంద్రియవిచారమునందు విచారహీనయై తుష్టినొందనిదై యుండినది.

ఔరంగజేబు తండ్రిని పదచ్యుతుని కావించి చెఱలోనుండి రాజ్యాపహారము చేయుటకు ప్రయత్నపడినప్పుడు రోషనార్ వానికి సహాయురాలై యుండినది. ఔరంగజేబు దానిమాట జవదాటకుండి నాఁడు. ఔరంగజేబు రాజ్యకాలమునందు రోషనార్ రెండవపాదషాహాస్థాన మలంకరించినదై యధికారము చేయుచుండినది.

ఎవ్వరికైనను జయకాలము శాశ్వతముకాదుకదా? రోషనార్ మహాపదవికి మహాపదసంభవించుకాలము సమకూరెను. దానికి ప్రతికృతియై మహాశక్తిశాలిని యొక్కతె తలయెత్తెను. ఔరంగజేబునకు ముగ్గురుకన్యకలు గలరు. చెఱయందున్న తన యన్నయొక్క యిర్వురు కొమారులకును తనకనిష్టపుత్రికల నిర్వురనిచ్చి పెండ్లిచేసెను. పెద్దదైన * జేబఉన్నీసా అనునది పెండ్లిచేసికొనక వసంతకాలభ్రమరమెట్లు ప్రతిపుష్పమునందలి మధువునుగ్రోలుచు సంచరించునో అట్లు సంచరించుచుండినది. ఇంతమాత్రమేగాక, మేనత్తకు పోటిదై మెలఁగుట కారంభించినది. మఱియు మేనత్తమహిమను తండ్రికి వివరించుచుండినది. తత్ఫలముగా రోషనార్ పృథివినుండి యదృశ్యయైనది. పిమ్మట, జేబఉన్నీసా మేనత్తయొక్క పదమర్యాదయు, దానిపదానతజనులను బొందినది.

పదమర్యాద యని చెప్పితిమి; దాని యభిప్రాయ మేమనఁగా, పాదుషాయొక్క అంతఃపురములో ఖోజాలకుతప్ప తక్కిన యేపురుషునకును ప్రవేశము లేదు; అంతఃపురసంరక్షణార్థమై యొక స్త్రీసేన కలదు. ఏలాగు హిందూరాజులు ముసల్మాన్ స్త్రీలను రాణీవాసమునకు కావలి యుంతురో, ఆలాగు మొగలాయిరాజులు తమయంతఃపురమున తార్తార జాతి స్త్రీలను రక్షణార్థమై నియమించుచుండిరి. ఈ స్త్రీసైన్యమునకొక నాయిక కలదు. అది సేనాపతి స్థానమునందుండునది. దాని పదవిగొప్పది.

* మహమ్మదీయు లెల్లరు జేబ-ఉనీసా, లేక, జెయిబ-ఉన్నిసా అనెదరు. కొందఱు పాదరిమాత్రము ఫఖర-ఉన్నీసా అని పొరఁబాటుపడి వ్రాసిరి.

దానికి తగిన జీతమును కలదు. ఈయధికారమునందు మున్ను రోషనార్ యుండినది. అది యున్నట్లుండి భూమియందుండి మాయమైపోయినది. అది మఱుఁగై పోయినమీఁద, ఆపదవిని జేబ ఉన్నిసా పొందినది. అది మొదలు * రంగమహలునకు సర్వాధికారిణి యాయెను. స్త్రీలెల్లరును దానిమాటకు లోఁబడి నడచుకొనుచుండిరి. అనఁగా ప్రతీహారులు, ఖోజాలు, చాకిరిచేయువారు, కావలివారు, బోయీలు, వంటచేయువారు, అందఱును దానిమాటచొప్పున వర్తించుచుండిరి. కాఁబట్టి అది తనయిష్టము వచ్చిన మహలులోనికి పోవుట కాటంకము లేకుండినది.

మఱియు నిరుతెగలవారికి మాత్రము అంతఃపురప్రవేశము కలదు. మొదటితెగవారు ప్రణయభాజనులు, రెండవతెగవారు సమాచారములను విక్రయించి ధనము గైకొని పోవువారు.

జేబ ఉన్నిసా రాజనీతియందతి సమర్థురాలని ముందే చెప్పియున్నాముకదా. మొగల్ సామ్రాజ్యమనెడి నావయొక్క చుక్కాని దాని చేతియందుండెను. అది మొగల్ సామ్రాజ్య నక్షత్ర మని పేరెత్తినట్టిది. రాజకార్యధురంధురుల కెప్పుడును వేగులవారితోఁ బనికలదని వేఱుగఁ జెప్పవలయునా? శ్రీరామచంద్రుఁడు మొదలుకొని బిస్మార్కువఱకును గలవారెల్లరు దీనికి ప్రమాణభూతులై యున్నారు. జేబఉన్నిసా ఈ రహస్యమును చక్కఁగా నెఱిఁగినట్టిది. అది పలుచోటులలోని వృత్తాంతములను సంగ్రహించుచుండినది. అందులకై కొందఱను నియమించి యుండెను. వారిలో చిత్రములువ్రాయు ఖిజర్ షే కొక్కఁడు. వీనితల్లి పలుచోటులకేఁగి చిత్రములను విక్రయించుచు నచ్చటచ్చటఁగల వృత్తాంతములను దెలిసికొనివచ్చి కొమారునితోఁ జెప్పుచునుండును. ఖిజర్ షేక్ తనభార్యయైన ఫాతిమాతోఁ జెప్పును. అది దరియాతోఁ జెప్పును. దరియాబీబియొక్క అక్క సుర్మా అత్తరు మొదలగు వస్తువులను విక్రయించు

* పాదుషా అంతఃపురమునకు రంగమహాల్, లేక, మహాల్ అని పేరు.

నెపమున ఢిల్లీనగరములోని సమాచారములను సంగ్రహించికొనివచ్చి దరియాబీబికి చెప్పుచుండెను. దరియాబీబి జేబఉన్నీసాకు తెలియఁజేయు చుండును. జేబఉన్నీసా వారమునకొకసారి వృత్తాంతములను జెప్పువారికి ధన మిచ్చుచుండును. దీనికే 'సమాచారవిక్రయ' మని మున్ను చెప్పి నారము. వార్తలను దెచ్చువారు ప్రవేశించుట కాటంకము లేకయుండు నిమిత్తమై అట్టివారి కెల్ల జేబఉన్నీసా పరవానా యిచ్చియుండెను. అట్టి పరవానా దరియాబీబికిని కలదు. అది రహస్యమును బురు లెఱుంగ కుండుటకై సుర్మావిక్రయించుదానివలె తనకిష్టమువచ్చినపు డంతయు రంగమహాలునకుఁ బోవుచుండును.

అయినను ఆదినము దరియాబీబి అంతఃపురమునకుఁ బోవునపుడు హఠాత్తుగా విఘ్నము సంభవించెను. ఆ వేళకు మబారకుఁడు రంగ మహాలునకుఁ బోయి యుండెను. అందువలన అది కొంచెముసేపు తాళి మహాలునకుఁ బోయెను. అట్లుపోయియు జేబఉన్నీసా విలాసగృహము నందే మబారకుం డుండెను. ఆ సంగతి నెఱింగి దరియాబీబి యేమియు నెఱుఁగనిదానివలె నొకచోట నొదిగియుండినది.

---

## 8. ఐశ్వర్యనరకము.

ఢిల్లియందు సారభూతమైనది ఢిల్లికోట. కోటయందు సారభూత మైనది రాజప్రాసాదమాలిక. ఈరాజప్రాసాదములం దున్నంత ధనరాశి యు, రత్నరాశియు, రూపరాశియు, పాపరాశియు, ఈభారతవర్షమునం దుండునవి యంతయు చేర్చినను అచ్చట నుండుదానికంటె చాలతక్కువ గనే యుండును. రాజప్రాసాదములందు సారభూతమైనది యంతః పురము. ఇది కుబేరకందర్పులరాజ్యమై యుండినది. సూర్యచంద్రులకు ప్రవేశము లేదు. యముఁడు గోప్యముగ ప్రవేశింపవచ్చునేగాని బహిరం గముగాఁ బ్రవేశింపఁడు, వాయువునకు గతినిరోధమై యుండినది. అందలి

చిన్న చిన్న గదులు విచిత్రములై యుండును. ఆ గదులయొక్క అలంకారములును, అచ్చటి యువతీజనుల యలంకారములును విచిత్రములై కానంబడును. ఇట్టి రత్నస్థగితమైనదియు ధవళశిలానిర్మితమైనదియు నగు కక్ష్యాంతరము లెచ్చోటను లేవు. ఇచ్చటఁగల నందనవనమును నిందించెడి యుద్యానవనములవలె వేఱెచ్చటను గానంబడవు. రంభాదులను తిరస్కరించు సుందరీజనులమండలి యెయ్యెడను లేదు. ఇంతటి భోగవిలాసాదులు మఱెక్కడ నుండవు.

ఇంతటి రమ్యప్రదేశమునడుమ జేబ ఉన్నీసాయొక్క ఆమోదముకొఱకు నిర్మింపఁబడిన విలాసమందిరము కలదు. ఆమందిరము శ్వేతకృష్ణశిలామయప్రదేశము. గోడలన్నియు శ్వేతమర్మరశిలానిర్మితములు. ఆ గోడలయందు రత్నములచే నిర్మింపఁబడిన లతలు, పుష్పములు, ఫలములను వివిధరత్ననిర్మితపక్షు లాలతాదులను నానాగ్రములతో పొడుచుచుండునట్లును; నీలరత్నభ్రమరములు రత్నపుష్పములందలి మధువును గ్రోలుచుండులాగునను నిర్మింపఁబడి యుండినవి. గోడలలో కొంచెముఎత్తున దర్పణములు ప్రేలఁగట్టఁబడి యుండినవి. అవి బంగారు కుచ్చులతో తనరారుచుండినవి. ఆప్రదేశమునందు నవవర్షాసమాగమోద్గతమైనదియు కోమలమైనదియు నగు లేఁతపచ్చికకంటె మృదువైన రత్నకంబళము పఱచియుండెనది. దానిమీఁదనున్న గజదంతములచే నిర్మింపఁబడిన పర్యంకమునందు జరీపనిచేసిన మొకమల్ మెత్త పఱవబడియుండెను. దానిచుట్టు చిన్న చిన్న బల్లలపై సుగంధపుష్పములు, వివిధపరిమళద్రవ్యములు, నానావిధములైన మద్యపూరిత కాచపాత్రములు, ప్రయత్నపూర్వకముగా సిద్ధముచేయఁబడిన తాంబూలము నుంపఁబడియుండినవి. ఇట్టి విలాసగృహమునం దర్ధరాత్రియందు వాతాయనపథమున ప్రౌఢయైన జేబ ఉన్నీసా అమూల్యవస్త్రాభరణాలంకృతయై పానపాత్రను చేతనుంచికొని నక్షత్రశోభను వీక్షించుచు, చల్లనిగాలిచే పుష్పమండితమస్తకమును శీత

వసుదేవాదులు ప్రస్తుతింపఁ గమలాక్షుండు విష్ణుండు శ్రీ
వసుదేవాత్మజుఁడై జనించె సుగుణవ్యాపారపారీణతన్. 120

క. నూతనలీలల నందని, కేతనమునఁ బెరుఁగుచుండి కృష్ణుఁడు కడిమిం
బూతనయనియెడు నసురిని, చేతనఁ గావించె భువనచిత్రము గాఁగన్. 121

క. నికటమున దనుజమాయం, బ్రకటంబగుచుండుఁ దెలిఁగి పటుబలయుతుఁడై
శకటంబొకటి ముకుందుఁడు, వికటంబుగఁ గూలఁదన్ని విబుధులు పొగడన్. 122

సీ. మాయతాసురుఁ ద్రుంచె మద్దులఁ బెకలించెఁ గినిసి వత్సాసురుఁ జంపెఁ దునిమె బకుని
నఘుదానవునిఁ గూల్చె నలరి కాళియు నొంచె దవశిఖి ద్రుంచెఁ గోత్రము ధరించె
శంఖచూడునిఁ జేర్చె సాధించె వృషదైత్యుఁ గేశి నణంచె ముగించె వ్యోముఁ
జాణూరుఁ దెగటార్చెఁ జక్కాడెఁ గంసునిఁ దవిలి యొయ్యనఁ గాలయవనుఁ జెఱిచె
నలజరాసంధముఖ్యులౌ ఖలులఁ దఱిమె, ద్వారకయనంగ నొకరాజధాని నిలిపె
బాంధవులకెల్ల నిత్యశుభంబు లొసఁగె, మనుజమాత్రుండె దేవకీతనయుఁ డరయ. 123

చ. సకలబుధానుసారి యదుశౌరికిఁ గన్య నొసంగి భూమినా
యక శుభలీలలన్ వెలయుటందము నొందుము నంచు నీవు నే
లోకనృపసూతికిన్ వికసితోత్పలనేత్రి నొసంగఁ జూచుట
ల్లికటసాలమొల్లక చలించి ముసిండిఫలంబుఁ గోయుటల్. 124

రుక్మి కృష్ణునిదూలనాడుట.

క. అని సభ్యులాడు పలుకులు, తనచెవులకు ములుకులగుచుఁ దగిలినఁ గోపం
బునఁ గటములదర నందఱుఁ, గనుఁగొని యప్పుడనియె రుక్మి గర్వోద్ధతుఁడై. 125

చ. అవు నవు మంచిపెద్దలె బళీ నరపాలుని మ్రోల నూఁగు జీ
చివుకులకెందుఁ జొప్పడని చేపలు వెట్టుచు గట్టిపట్టుగాఁ
జెవులకు ముల్కులై వినఁగఁ జెల్లని పల్కులు మాటిమాటికిం
దవిలి వచింపఁ జాఁగితిరి దబ్బఱలింకను జాలు నూరకే. 126

తే. మదిని మీమాటె పరమధర్మంబటంచు, నమ్మియుండినఁ గార్య మెంతయును జెడదె
పెద్ద లనియెడి గంపంత పేరె కాని, బుద్ధి ముదిమిని దప్పినఁ గొద్దిగాదె. 127

ఉ. గొల్లలయిండ్లఁ బాల్పెరుగుఁ గొల్లలుగా సతతంబు ద్రావి యు
త్తిల్లి యరణ్యదేశముల ద్రిమ్మరు ద్రేపులకాపరిన్ గదన్

బల్లిదుఁడంచు నెన్నెదరు సర్వవిదుల్ వారి నెఱుంగ కియ్యెడం
దెల్లఁ గొల్లబోయనికి బింకము బంటుఁదనంబు గల్గునే. 128

చ. చిదికినబండి ద్రొక్కుటయుఁ జెట్లు పెకల్చుట పాలొసంగు దా
నవి భుజియించి ద్రోయుట వనంబునఁ బామును గొంగ నెద్దు వా
రువమును గర్దభంబును విరోధు లటంచుఁ దలంచి చంపుటల్
శిశుశివ విక్రమంబు లని చెప్పఁగఁ జిత్రములయ్యె నియ్యెడన్. 129

క. మంచిది మాపలు కిప్పుడు, వంచింపఁగవలదు బాంధవమునకుఁ దగునే
క్రించుఁడయి మేనమామం, ద్రుంచిన ఖలుఁ డెంతబలయుతుం డైయున్నన్. 130

చ. సరిసరి మావిచార మిఁకఁ జాలు శిరీషసుమోపమానభా
సురసుకుమారయై సకలనారిజనాభినుతోల్లసద్గుణా
కర యగు రుక్మిణిం బసులకాపరి కియ్య మదిం దలంతురే
గురుతరరత్నహార మొకక్రోఁతి మెడం దవిలింపఁ జూతురే. 131

క. మాకిష్టం బని వరుచా, మీకరనిభగాత్రి నెట్లు మీఁ దెఱుఁగక నేఁ
డాకటిగొల్లకొసంగుదురు, కాకిమెడం దొండపండు గట్టినభంగిన్. 132

ఉ. కటకట సర్వభూభరణకారణభూరిభుజాగ్రజాగ్రదు
త్కటపటుశింజినీనినదకార్ముకముక్తశరాహృతారిరా
డ్భటపటలుండు భీష్మకనృపాలుఁ డనం బ్రభమీఱి యీతఁడే
కుటిలతనొందె గొల్లనికిఁ గూఁతు నొసంగిన నవ్వరే జనుల్. 133

క. మావాక్యము గొఱగాదని, తా వేఱొకటనుట పడుచుఁదన మిది యనుచున్
భావింపక యాఁజూడఁడు, వేవిధములఁ గేలు మొగిచి వేఁడెద మిమ్మున్. 134

తే. ఘనుల కెల్లను దమ డెందమునకు నిష్ట, మగు తెఱంగున నొనరింపఁదగును గార్య
'మాత్మబుద్ధిస్సుఖంచైవ' యనెడు వచన, మరయ నిద్ధాత్రిపై నిశ్చయంబు గాదె. 135

క. శశిముఖి యగు రుక్మిణి న, ప్పశుపాలునకొసఁగ నొల్లఁ బదివేలైనన్
మశకీకృతవరబలుఁ డగు, శిశుపాలున కిపుడు పెండ్లిసేయుదుఁ బ్రీతిన్. 136

ఉ. సంగరరంగరంగదరిసామజభీమజవప్రదీపితో
త్తుంగనృపేంద్రుఁ డంగభవతుల్యమనోహరమూర్తి భూమిభృ
త్పుంగవవర్ణనీయపరిపూర్ణగుణాకరుఁ డిందుచంద్రికా
భంగయశోన్వితుండు శిశుపాలుఁడు చూడ నృపాలమాత్రుఁడే. 137

తే. అనుచుఁ బెద్దల నదలించి యాడురుక్మి, మాట గాదన కపుడు భీష్మకన్సపాలుఁ
డొనర నారాజునకుఁ గన్య నొసఁగఁ దలఁచి, యవిరళామోదమానసుఁ డై చెలంగె. 138

క. అని శౌనకాదిమునులకు, ఘనుఁ డా సూతుండు దెలుపుగతిని పరీక్షి
జ్జనపతికి శుకుఁడు చెప్పిన, విని యవ్వలికథయుఁ దెలియ వినఁ గోరుటయున్. 139

మ. పురుహూతాబ్జభవాచ్యుతార్చితపదాంభోజాతటీతాపనీ
ధరకన్యాకుచకుంభసంభృతలసత్కస్తూరికాశాదమే
దురదోరంతరహారహీరశరగోదుగ్ధేందురత్నావళీ
శరదభ్రాభ్రధునీసితాభ్రశశభృత్సంశుభ్రగాత్రప్రభా. 140

క. కనకాచలరుచిరశరా, సనకాక్షోదరవిభూష సనకాదినుతా
వనకారణ గుహాకరిముఖ, జనకా నుతచరిత దీనజనకామ్యదాతా. 141

తరల. సమరభీషణ సత్యభాషణ సారసాహితభూషణా
సమదవారణ చర్మధారణ సంతతాగమకారణా
ప్రమథనాయక భద్రదాయక పద్మలోచనసాయకా
శమనశిక్షక సానురక్షక శత్రుగర్వవిమోచకా. 142

మాలిని. సరసగుణకలాపా సర్వలోకప్రదీపా
సురుచిరతరరూపా శోషితాశేషపాపా
పరిహృతసుమచాపా భాసురోగ్రప్రతాపా
నిరుపమహరిరోపా నిత్యసత్యానులాపా. 143

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర వరప్రసాదలబ్ధ కవితాసామ్రాజ్య ధురంధర
కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ
తిమ్మయనామధేయ ప్రణీతంబైన రుక్మిణీపరిణయం
బను శృంగారప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.

---

శ్రీకృష్ణాయనమః.

# రుక్మిణీపరిణయము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీరుచిరతరసితాంగా, కారుణ్యమయాంతరంగ కలుషవిభంగా
పారావారనిషంగా, గోరాజోన్నతతురంగ కుక్కుటలింగా. 1

తే. అవధరింపుము మును శౌనకాదిమునుల, కనఘుఁ డాసూతుఁ డెఱిఁగించినట్లు వ్యాస
సుతుఁడు సుమహితకౌతుకోన్నతిని భరత, కులున కవ్వలికథయును దెలుపఁ దొడఁగె.

క. నరవర విను భీష్మకభూ, వరుఁ డాక్రియఁ బుత్త్రినను వరుఁడై పుత్త్రీ
పరిణయకార్యారంభ, స్ఫురణం జెలరేఁగి యొక్క శుభకరవేళన్. 3

భీష్మకుఁడు రుక్మిణిని శిశుపాలున కిచ్చునట్లు సందేశసంప్రుట.

ఉ. రమ్ము రయంబెకుండినపురమ్మునకున్ సచివాప్తబంధుజా
తమ్ములఁగూడి నీ కవితథమ్ముగ నిచ్చుట రుక్మిణిన్ వివా
హమ్మొనరింతు రాజనివహమ్ములు మెచ్చఁగ నంచు జాబువా
కమ్ము లిఖించి పంచెఁ గౌతుకమ్ములరన్ శిశుపాలు పాలికిన్. 4

ఉ. పంచినరేఖఁ గాంచి శిశుపాలుఁడు తద్దయు నుత్సహించి య
ర్ఘ్యంచితకాంచనాంబరచయంబు రయంబున మాత కప్పడి
ప్పించి సమస్తబాంధవులఁ బెద్దల సంగడికాండ్ర నెల్ల రా
వించి వివాహలేఖఁ జదివించిన వారలు సంభ్రమించుచున్. 5

తే. మచ్చిపనియయ్యె నిపుడు భీష్మకునితోడఁ, జుట్టఱికమబ్బె నెంతయు సులభమగుచు
నిందులకు సంశయింపంగనేటి కింక, శోభనోద్యోగమాచరించుట మతంబు. 6

చ. అదియునుగాక రుక్మిణి యొయారము సార మయారె సారెకున్
దడలక భూసురేంద్రు లనవద్యగతిన్ నుతియింతు రానవాం

బుదనికరోపమానకుచఁబోలరు పన్నగరాజకన్యలున్
బదముల సిద్ధసాధ్యసురచారణకన్యలు రాజకన్యలున్. 7

చ. అలికులవేణియుం బిసరుహాననముం నిడువాలుఁజూపులున్
జిలిబిలిపల్కులుం దళుకుఁజెక్కులు కెంజిగురాకుమోవియుం
గులుకుమిటారిగుబ్బలును గొప్పపిఱుందులు లేఁతనవ్వులుం
గల యలుకక్కిణిం బొగడఁగాఁదరమే పరమేష్ఠికైనియున్. 8

ఉ. సారముముద్దుఁబల్కు ఘనసారము నిద్దపు మేనితావికా
సారము నాభిరంధ్రము విసారము లేఁతమిటారిమోము శ్రీ
కారముకర్ణయుగ్మము చోకారమునవ్వు మొగంబు పట్టదా
కారముకొప్పు సన్మథువికారము మోవి వధూలలామకున్. 9

క. కనకంబె మెయివన్నియ, కనకంబే గళము విమలకమలేక్షణకున్
ఘనమే జఘనము మేచక, ఘనమే చకచకలనలరు కచ మంగనకున్. 10

క. లికుచంబులుగద జవరా, లికుచంబులు తేఁట్లు సైఁదలికదంబులు లే
మ కరంబులు కెందమ్ములు, మకరంబులుజంఘ లాహిమకరాననకున్. 11

తే. మందమానస నెన్నడు మందమాన, భంబు నవపాళికనకకుంభంబుచంబు
చందమామకుఁదులమోము చందమామ, నోజతాపులు దాపులు రాజసుతకు.

సీ. తమరేందుబింబంబుఁ దచ్చంద్రికాతతి సదలించు నాసన హాసములను
దంతికుంభంబులఁ దద్గమనంబుల నపహసించు నురోజ యానములను
దర్పకాశుగములఁ దచ్ఛరాసనములఁ బూని యోడించు దృగ్భ్రూయుగములఁ
దామరపువ్వులఁ దద్భ్రమరశ్రేణులఁ బరిభవించు పరాంఘ్రిబాహువులను
శరథివీచులఁ దన్మహాసైకతముల, గదుముఁబోదలు వళిత్రయకటితటములఁ
జంపకంబులఁ దన్మృదుసౌరభముల, మొనయు నాసాంగవాసనలను వధూటి. 13

క. ఆకామిని నుద్వాహం, బై కామునిఁ గెల్చి చిరతరానందరసా
స్తోకగతిన్ వసియించుట, నాకాధికసౌఖ్యలీల నలరుట కాదే. 14

ఉ. మంచముకోటఁ దేనెయిడుమాడ్కిఁ దనంతనె తానె యిప్పుడా
చంచలనేత్ర నీఁదలఁచి సారయశుం డగుకుండినేశ్వరుం
డంచితలీలఁ గాంచెసమయం బగుశోభనశోభయంపి సి
ల్పించినయప్పుడే చనవలెన్ పటి మేలగునంచు నెంచుచున్.

క. భృత్యులఁ దీర్పరు లైనయ, మాత్యులఁగన్గొని ప్రమోదమతి నఖిలజన
స్తుత్యముగ మంగళోచిత, కృత్యము లొనరింపుఁ డనినఁ గేరుచు వారున్. 16

క. పరిపరివిధముల నమరన, గరిగరియన్ మెఱయుపురి జగన్నుతగతి వా
విరి విరివిగ నలరఁగఁజే, సిరి సిరి కిరవగుచుఁ గ్రొత్తచెలువు దలిర్పన్. 17

తే. శిల్పిక కళాద లేపక చిత్రకార, రజక మాలిక కుంభకారక కువింద
చర్మకారక ముఖ్యుల సరగఁ బిలిచి, వలయు నయ్యైప్రయోజనంబులు ఘటించి. 18

క. దివ్యము లగుకల్యాణ, ద్రవ్యములుం గూర్చి సప్తదంబున నీకఁ గ
ర్తవ్యం బెయ్యది యనుటయు, భవ్యమతిం బ్రోడలైన బంధుగు లెల్లన్ 19

గీ. నెమ్మి యగు పెండ్లిలగ్నంబు నిర్ణయించి, కమ్మవ్రాయించి యాభీష్మకక్షితీశు
భటునితోఁ గూర్చి మఱి తమభటుని నొకని, నొనరఁ గుండిననగరికిఁ బనుపుటయును.

క. ఆభటు లిరువురు బలజి, ద్వైభవుఁ డగుకుండినేంద్రుదర్శించి వెసన్
శోభనపత్త్రిక యొసఁగఁ జి, రాభినవానందమందహాసాననుఁడై. 21

క. మణికల్యాణాంచితభూ, షణము లనేకంబుగా నొసంగి న్నృపగ్రా
మణి కల్యాణాంచితభా, షణములఁ జేదీశభటుని సంతసపటిచెన్. 22

ఉ. అంతట వాని వీడ్కొలిపి యాప్తులబాంధవకోటులన్ మహీ
కాంతులఁ బిల్వఁబంచి శుభకారణవస్తువులెల్లఁ గూర్చి వీ
డంతయు వింతమీఱఁగ రయంబ యలంకృతి సేయుఁడంచు న
త్యంతకుతూహలంబలర నాజ్ఞ యొసంగినఁ బౌరులందఱున్. 23

ఉ. గోడలనెల్లఁ జిత్తరువుగూర్చి నిద్దపుఁజందమామరా
మేడ లలంకరించి జిగిమీఱఁగఁ బల్లవహల్లకంబులం
గూడిన రత్నతోరణపుఁగోటులమర్చి బహిర్విహారపుం
జాడల వీథివీథులను జల్లిరి సారపటీరనీరముల్. 24

క. నిగనిగజిగిఁ బొగడఁగఁదగు, పగడపుఁగంబములునించి పఱపుదలిర్పం
సొగసుగ ముత్తెపుఁబందిరు, లగణితముగనిల్పి రప్పు డాకసమొరయన్. 25

ఉ. రంగుగ మేలిబంగరు మెఱుంగుటరంగుల నంగనామణుల్
పొంగుచు రంగవల్లికలు ప్రోడతనంబుల వ్రాసి వాసిమీ
ఱంగ మృగీమదంబుఁ గపురంబును సాంకవమున్ మెదించి యు
త్తుంగకవాటపాలికల దోర మెలర్పఁగ మెత్తి రత్తఱిన్. 26

తే. పురములోపల రత్నగోపురము లెల్లఁ, గరము మెఱయ నలంకృతి నెఱి నొనర్చి
భూరి శోభాసమేతప్రభూతశాత, కుంభకుంభంబు లామీఁదఁ గుదురుపఱిచి. 27

క. నగరులలోపలఁ గపురము, నగరులధూపములు వెట్టి యతిశయగతి న
న్నగరిపు నగరికి సరియౌ, న్నఁగ నగణితలీలఁ జెలువొనర్చిరి వరుసన్. 28

వ. అప్పు డప్పురవరంబు మరకతమణికృతవితతవిభావిభాసితోన్నతజాలక జాలకాంత
ర్నిష్క్రాంతాగరుధూపధూమశ్యామాభ్రభ్రమామిళితకామిత లీలాకేళిసలోలకేకికానీల
కంఠానీకంబును, బ్రతినికేతన కేతన నూతనవితానశతాగ్ర్యమణినికాయకాయ
మానవిరాజమానంబును, నవరత్నకీలితలాలిత శోభాసమానభాసమానానూనమానవేశ
నివేశద్వారాపారప్రమోదపూరణకారణతోరణావలంబి బింబఫలశంకాంకురకీరావళి
కమలరాగోపలచాపలభావ ధావన్మహోత్సుక శుకనికరంబును, ఘనఘనసారసార
సారంగమదామోదక హిమోదక ధారావారాభిషిక్త సంసక్తముక్తాఫలముగ్గుకీర్ణ
నిరర్గళరాజమార్గంబును, సభాభవనభువనాద్భుతకరారచిత రుచిరతరవ్యాజరాజీవ
రాజోన్మూలనారంభ సంరంభ సమయసమర్యాదాకుంఠిత కపటకంఠీరవఘోరాకార
విలోకనభీతభీతమాతంగగ్రాహితంబును, ధాళధళ్యప్రభాపూరహీరశిలాబద్ధసిద్ధకుడ్యాం
తర్నిహిత మహితముకురనికురుంబబింబితాభ్రభ్రగ్న స్వర్ణస్తంభోజ్జృంభితమాణిక్య
స్థగితపాంచాలికాబాలికావదనేందుబింబచుంబనలాలస బాలిశ యువజన ఘనాభి
రామంబును, బ్రభూతశాతకుంభకుంభరంభాస్తంభకుంభ ద్బహిర్ద్వారప్రదేశంబును,
రంగత్కురంగమదాగరుచందన చంద్రాకలంక సంకుమదాది కామోదశాదపే
దుగవేదికాంగణ దేహళీమోహనంబును, సురుచిరపరీసహారాంతర నిరంతరనిద్రాగత
ఘూర్ణలరేఖాహిబోద్ధసన్నద్ధహేతుక కౌతుకప్రణాదితకిటతముఱజదగద్ఘుర్ఘర పటుపటు
హకాహళ భూరిభేరీభాంకారనినదంబును, సువాసినీకృతమంగళగానానుయాపతాన
మాన సంధానక గోపురోపరిపరిస్ఫుటత్కనకఘటాంతర్నిమీలితప్రశస్తకీలాగకిందని
ష్యందన్మరందపానానందితసుందరేందిందిర బృందామందమధురఝంకారంబును, నిర
తభరతకళాకౌశలప్రణర్తితనర్తకీజనఘనస్వేదోదకాపనోదక మహోద్యానవనానాసుగంధ
గంధిలసౌగంధిక సారససౌరభ్యసరస సరసీతలశీతలమారుత చాయతనంబును, ఫలసిత
ఫలకుసుమవిసరావసరనైవేద్య సద్యోభ్యుతయుతాపూపసూపాన్న ధూపదీపపాటీరపీటీ
రాజన్నీరాజనపూజనాలంకృతదేవతాయతనంబును, హాటకతాటంకకంకణ కింకిణీ
వలయతులాకోటికోటీర హారకేయూరగళాభరణాచరణకటకోర్మికాంచదాకాంచీముఖ
నిఖిలవిభూషణాంబర మాల్యానులేపనప్రదీపిత సకల యువయువతిజనమనోహరం

బును, బహువిధవర్ణోల్లిఖిత చిత్రలీలాతిరస్కృత తిరస్కరిణీజాతజాతరూపనిర్మిత
నిర్మలహర్మ్యభిత్తికా నిచయంబును, మకరనికరాహీనమీనతిమిమీనకులీర కుళీరదుర్ధర
దర్దురోద్రేకగాంభీర్య కుంభికుంభీరనీరాధారపరిఖావిహరమాణమానసౌకః శోకాద్య
ఖిల ఖగకులకలకలరావానుకూల తాలప్రమాణమానిత పూర్ణకుంభసంభారాతి మంద
యానానుకరచిరంటీమంజు మంజీరనినదంబును, పవనజవననిరాఘాటఘోటక బంధుర
సింధురారోహణకౌశలకృపాణ బాణబాణాసనాద్యనేకాయుధాభ్యసనవాసనా
ప్రవీణధరణీవరకుమారవర్గంబును, చతురచతురాగమసాంగోక్తిసురభూసురాశీర్వాద
నాదవేదనాథామోదకరంబునై త్రిదివంబునుంబోలె వివిధబుధప్రకరాకరంబై, వై
కుంఠపురంబునుంబోలె ననవరతలక్ష్మీనివాసంబై, కైలాసస్థానంబునుంబోలె సర్వ
మంగళాలంకృతంబై, సత్యలోకంబునుంబోలె నతులితకళాసంపదంబై, రసాతలం
బునుంబోలె నవిరళకంచుకి సమంచితంబై, యొప్పెనంత. 29

## రుక్మిణి చింతించుట.

క. ఇత్తెఱఁగంతయుఁ దన చెలి, కత్తెఱఁ గెఱిఁగింపఁ గని మొగంబున దైన్యం
బత్తుకొన నపుడు రుక్మిణి, చిత్తము వత్తరమునొందఁ జిడిముడిపడుచున్. 30

గీ. కటకటా రుక్మి యన్యాపకర్తుఁ డిపుడు, చేదిభూనాథునకుఁ బెండ్లిసేయుటకును
బూనియున్నాఁడు వానికీబుద్ధిమాన్పి, తవిలి శౌరికిఁ గూర్పవా రెవరుగలరు. 31

క. వినయవిహీనుం డగుచును, దన యానతిమీఱితిరుగు తనయానుమతిం
బనియొనరింపఁగఁ దొరఁకొనె, జనకుండును నేమరగుచుఁ జంచలబుద్ధిన్. 32

చ. చెలువున బంధులుద్యమము సేయక బుద్ధివిహీనులైఁ ఫలో
త్కరము ముసిండిచెట్టునకుఁ గల్గఁగఁ జేయుచు నున్నదైవడిన్
హరహర పాపజాతివిధి యావనమాలికిఁ గూర్ప నొల్లకీ
పరమనికృష్టుఁ డైనశిశుపాలున కేక్రియఁ గూర్పఁ జూచెనో. 33

చ. సరసగుణాభిపూర్ణుఁ డగు శౌరిపదాంబుజసేవ సేయఁగా
మరిమరిగోరుచిత్త మిఁక మక్కువ నన్యులఁ జేరఁ గోరునే
నిరతశుభాకరామరధునీపృథునీరవిరాజమూర్తికా
పరిచితరాజహంస మొకపట్టున పచ్చికపట్టుఁ జేరునే. 34

క. హైమవతి కిపుడు నాపై, ప్రేమ మదింగలిగెనేని వెస నొనఁగూడున్
దామోదరసాంగత్యము, దామోదరసాభ్యుదయనిధానంబగుచున్. 35

...క్రొత్తగ్రంథము! 400 పుటలు!!

# ఆంధ్రులచరిత్రము



...నిపటములు. (రెండవ భాగము.) కాలికో బైండింగు.

...పరిశోధనచేసి వ్రాయబడిన అద్వితీయగ్రంథము. తెలుగు
...మిక్కిలి చక్కగ వర్ణింపఁబడినవి. రెడ్లు, కమ్మ
...ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు, పల్నాటివీరులు,
...త్రలు మనోహరమగు శైలిని వర్ణింపబడినవి.
...చదువవలెను. వెల 1-8-0

...గ్రంథకర్త. చిలుకూరి-వీరభద్రరావు గారు.



తయారయినది!!

నూరుపుటలు. కాలికో బైండింగు.

ఇది డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారిచే రచింపఁబడినది. ఇందు కలరా రాకుండ గ్రామములను కాపాడు విధము, కలరా వచ్చినప్పుడు దానిని పోగొట్టు మార్గములు, చికిత్స సులభముగ అందరికి తెలియునట్లు వర్ణింపఁబడినది. తెలుఁగు వైద్యశాస్త్రి ప్రకారము, ఇంగ్లీషువైద్యప్రకారము మందులు, పథ్యపానీయాదులు వివరింపఁబడినవి. ఈ గ్రంథము ...చదివినవారు కలరాకు భయపడవలసిన పని లేదు. వెల 0-6-0

విజ్ఞానచంద్రికా గ్రంథమాలకు శాశ్వత చందాదారులగు వారికి ...పోస్టేజితోటి పై రెండు గ్రంథములు రు 1-4-0 లకే ఈయఁబడును.

...చిరునామా:—

మేనేజరు, విజ్ఞ...

# అభినవసరస్వతి



యను నొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము 9 } 1917సం॥ జనవరి ఫిబ్రవరి { సంచిక 1,2

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 3 0 0 |

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur.,
and published at Janapadu, by the Editor ,Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

2 రాజా బెల్లపురవలరాఘవేంద్రరావు బహద్దూర్, జాగిరిదారుగారు, నవాబుపేట.

## పోషకులు.

1 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునబు, నిడుబ్రోలు.

2 రాజా నారయప్పారావు సింహాద్రప్పారావు బహాదరు బమీాందారులు, నూజివీడు.

3 రామసింగుగారు నెల్లుట్ల షాపురవు సంస్థానముమేనేజరు నెల్లుట్ల.

5 రాజా వాసిరెడ్డిచంద్రిమౌళీశ్వరప్రసాదు బహాదరుమున్నేసుల్తాన్ జమీాందారుగారు, ముక్త్యాల.

6 అల్లాడి లక్ష్మణరావుగారు కరణము జంగపల్లి.

8 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోళ్లేడు.

9 అనంతరెడ్డి దేశాయిగారు పోతారెడ్డిపేట.

## సహాయులు.

1 అంగడెనరసింహారావుగారు, కరణం, మాజగంపాడు.

2 చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికిందాబ్రాదా

3 వెలుగూరి పిచ్చయ్యగారు కొదముగుండ్ల

4 కానుమూను హనుమయ్యగారు నర్సారావుపేట.

5 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాదవరము.

6 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహాసీలుదారు నరసారావుపే

7 మల్లాది కామయ్యగారు, చింతపల్లిదొరసాని సంస్థానం గుంటూరు.

8 వెంకట నారసింహారెడ్డి దేశముఖుగారు-మిడిదొడ్డి.

9 మెదకు శేషారావు దేశముఖుగారు, వల్లబల్లి.

10 హాజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ.

11 నరసింహారెడ్డి దేశాయిగారు, కాపరబాద.

12 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి.

13 తూము నరసింహారావుగారు కట్టెంపూడి

14 కొకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీదీపురం

15 ఉల్లగంటివీర రాఘవరావుగారు, ముక్తాదారు. ఆనేపురం

16 బీరకాయల రామారావు దేశముఖుగారు, రాయగిరి.

17 తోర్లకొండ హనుమంతరెడ్డిగారు ఆలంవగిరాసేగ్దారు, యల్లారెడ్డిపల్లె

18 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదా.

19 శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీలుదారు జగిత్యాల

ములా ద్రవ్యసాధ్యములు. కావున దయయుంచి పత్రికాపరిపాలనమున నొకింత నాకుఁ బ్రోత్సాహ మొసంగుఁడు. వీపీలుచేసినను మీమీయశ్రద్ధవలననో పోష్టుపుర్వ్యాసుల యశ్ర ద్ధ్యమువలననో సగము తిరిగియే వచ్చెడిని. కొందఱు వీపీచేయనే తగకయుందురు. కావున మీరలే మీమీచందాలనంపి పత్రికం గొంతకాలము నిల్పుటకై ప్రార్థితులు.

## కృతివిమర్శము.

సుభద్రాకల్యాణము— ఇది యష్టావధానులును దిరుపతి వెంకటేశ్వరకవుల శిష్యులును శికింద్రాబాదునగరవాస్తవ్యులును నగు ముదిగొండ నాగవీరేశ్వరశాస్త్రిగారిచే రచింపఁబడిన యొక నాటకము. ఇందలి యితివృత్తమును గ్రంథనామమే వ్యక్తీకరించుచున్నదికదా! కవిత్వము రసవంతమును సలక్షణమును బ్రౌఢమును నై యలరారు ... తిరుపతి వెంకటేశ్వరకవీశ్వర శిష్యత్వమును సార్థకపఱచుచున్న ... కీర్ణంబును శృంగారరసబంధురంబును నగు నీ రూపక ... శేషసంతోషదాయకమ్మై యీయలంకారికుల కత్యం ... కవీంద్రులకుఁ గడుమనోహరంబై ప్రదర్శకుల చూపరులకు సులభవేద్యంబై హృద్యంబై యుం ... గాని యతిశయోక్తిగాదు. ఇందుఁ బ్రాతర్వ ... లములును సూర్యచంద్రోదయాస్తమయములును ... యున్నయవి. ఇందలి ప్రధానసేతి యుక్తవరాన్వే ... బగా వరశుల్కములును గన్యావిక్రయములును ... బను విధవావివాహములును విక్రీతకన్యావివాహ ... డియున్నయవి. తాళలయస్వరోపేతంబుగఁ బాడ ... ంగురీతిఁ జిత్రచిత్రవృత్తంబు లిందుఁ బెక్కు గా

...-0. వలయువారు సికిందరాబాదులోని జనర ... లువాది కోటిలింగము కంపెనీకి వ్రాసి తెప్పిం ...

శ్రీ సోమేశ్వరాయనమః

# స్వర్ణకారవ్యవహారము.

## చతుర్థభాగము

కం॥ రంగపతీ! రంగనాయక! రంగేశ్వర! రంగధామ! రంగనివాసా!
రంగ! యనువారిపాపము। కంగార్చె పొందుగాక కస్తూరిరంగా!
(కస్తూరిరంగశతకము)

మ॥ అల మాన్యార్థ విక్రయంబు జేసినవ్యయం బర్పింపనేబట్టి భూ
ములకుం జంతిలి కొన్నిరూపికలందా మూర్ఖాగ్రముల్ పాపెన
వ్వల నవ్వారికిఁ లాభ్ధిచంద్రముందు సుబ్రహ్మణ్యశాస్త్రిల్, తదం
ఘ్రులకుఁ మ్రొక్కి యుపక్రమింతు సికిఁ దీర్పుల్గలుగు సిభాగము

కం॥ మాన్యతయుంబుదోనుక। జేసినుదక యోజనంబు సిద్ధాంతితస్మా
* భాసిలు స్వాభిప్రాయము। వ్రాసెఁ మాన్యభుగాగు పరుసక గనుఁడీ

---

* గుంటూరు డివిజనల్ డిస్ట్రిక్టుమున్సిఫుకోర్టులో

మహారాజరాజశ్రీ కనకపల్లి రంగనాయకులు నాయుడుగారు, బియేబియల్
అడిషనల్ డిస్ట్రిక్టుమున్సిఫు

1912 సంవత్సరము మార్చి 30వ తేది శనివారము

అ॥ నెం 26 ౹౹ 1911

జానపాటి పట్టాభిరామశాస్త్రి గారు:— వాది

1 వోలేటి లక్ష్మయ్య 2 నందిగాను కాశీపతి 3 సిరపురపు భిక్షాపతి 4 నందిగాను చినబ్రహ్మము 5 జాజ్జూరి మల్లయ్య, } ప్రతివాదులు

1912 వ సం॥ 20 వ ఫిబ్రివరి మంగళవారమున వాదితరఫు ప్లీడరులగు మహా రాజశ్రీ రంగావఝ్ఝుల హనుమయ్య కొకాని పుండరీకాక్షుఁడు గార్లయొక్కయు 2, 3, 4, 5 ప్రతివాదులప్లీడరులగుచున్నవ లక్ష్మీనారాయణ, పి. అంకమ్మనాయుడు, జే. డి. సామ్యూయల్ గార్లయొక్కయు సమక్షమున నిదావా పేరింగునకు రాఁబడుటయు నది మొదలుకొని యాలోచననిమిత్తముంచి యీరోజున దీర్పు చెప్పబడినది-వ్యవహారమధ్యమున 1 ప్రతివాది చచ్చిపోయినాఁడు.

కం॥ ఈతీరుపునం గలిగిన। నీతులకుం జాలవరకు నిగ్గెసజవా
జే తానిడియోర్ జడ్జియు। జూతురు శా కంపముందు సుజ్ఞజనంబుల్

---

## జడ్జిమెంటు.

(1) పోలేరమ్మ పాతపాటమ్మల యాలయములలోఁ బ్రాణప్రతిష్ఠ చేయునధికారము తనకును దనకుల్లపుబ్రాహ్మణులకునే కలదనియుఁ బ్రతివాదులకును దద్వర్ణపువారికిని లేదనియు నిర్ధారణ సేయుటకును బ్రతివాదులు గాని తత్సంఘము వారు గాని యింకమీఁదటఁ బ్రాణప్రతిష్ఠ గాని మఱి యేవిధమయిన సంస్కారము గాని చేయకుండ నుత్తరువిచ్చుటకును దిరిగి వాదిసంఘపు బ్రాహ్మణులు ప్రతిష్ఠ చేయుటకుఁ గావలసిన రు 190లు ప్రతివాదులనుండి తమకిప్పించుటకును వాదిచే నీదావా తేఁబడినది.

(2) వాది బ్రాహ్మణుఁడై తద్బ్రాహ్మణులకు మట్టుకే యాగుళ్లలో విగ్రహప్రతిష్ఠ చేయుట కధికారము కలిగియుండి యీదావాకుఁ బూర్వము నాలుగు సంవత్సరముల నాఁడు వాదియు నితర బ్రాహ్మణులును వైశ్యుల సాహాయ్యముతో జానపాటిలో నదివఱకుండిన విగ్రహములు ప్రాతవై పూజానర్హతను బొందియుండినందువలనఁ దిరిగి ప్రతిష్ఠించియుండఁగా సంకీర్ణసంకరులగుటచే యాజనకర్మములోఁ జేరిన ప్రతిష్ఠ చేయుట కధికారములేని ప్రతివాదులు 1906 వ సం॥ జూలై 22వ తారీఖున శూద్రుల తోడ్పాటుతో సంప్రోక్షణమును వంక పెట్టుకొని విగ్రహముల నంటుపఱచి యుత్తములైన మాదుజాతులవారికిని బూజానర్హములఁ జేయుటమూలమున వాదికిని నుత్తములైన మాదుజాతులవారికిని బ్రస్తుతపు విగ్రహములఁ దోసివేసి పునఃప్రతిష్ఠ చేయవలసినంత యవసరముగలిగి యందులకు రు 190లు కర్చుపెట్టవలసివచ్చి యాజరిగినపని ప్రతివాదుల కొంటెతనమువలనగనుక వారాసొమ్మియ్యవలసియుండుటయు వాదియుఁ దత్సంఘములోని యితర బ్రాహ్మణులును బునః ప్రతిష్ఠ చేసిన తర్వాతఁ బ్రతివాదులు మరల నపవిత్రపఱుపకుండు రీతి నొక యుత్తరువు కూడ నవసరమయియుండుటయు నీదావా తెచ్చుటకుఁ గారణములుగాఁ జూపబడినవి.

(3) వాదితో ప్పాటీ గ్రామములోని బ్రాహ్మణులందఱు నీప్రతిష్ఠవిషయమునం దిష్టములేనివారు కారుకావున వారందఱిపక్షమున నీయనయొక్కఁడే దావా తెచ్చుటకు వీలులేదనియు నీరెండు గ్రామదేవతల బ్రాహ్మణులకుఁ బూజానర్హములఁ జేయవలెననికాక విగ్రహములు ప్రాతవై పూర్తిగా శిథిలములైనందువలన

కం॥ ఆయన వదలినవిషయము
లాయాభాగములఁ గొన్ని యలరుచుఁగానన్
న్యాయస్మృతిననుసరించుచుఁ
జేయువలె విమర్శము మనచే నగుదనుకన్ 4

చం॥ శిలలు పురాతనంబులయి చేప్పడియుండఁగ నూతనంబులన్
నిలిపితి మంతెకాని కడుమిష్ఠఁ బ్రతిష్ఠయొనర్ప లేదటం,
చల ప్రతివాదులందఱును నాన్సరులోన లిఖింపఁ జేసియున్
నలిపినటుల్ ప్రతిష్ఠ తమ సాక్షులచేఁ బలికించిరయ్యెడన్ 5

---

* మేము నూతన విగ్రహముల స్థాపించినారమే కాని ప్రతిష్ఠ చేయలేదనియు మేము యోజనములోఁ జేరిన ప్రతిష్ఠాదికర్మలం చేయుట కష్టమనియు నిప్పుడు తిరిగి ప్రతిష్ఠచేయవలసిన యవసరమే లేదనియుఁ బ్రతిష్ఠచేసినను దావా మొత్తము చాల తక్కువగనున్నదనియు వాది యేవిధమైనపరిహారమునకు నర్హుడు కాఁడనియుఁ ప్రతివాదులు పోరాడుచున్నారు.

(4) వాది ప్రాతసివిల్ప్రొసీజరుకోడు 30 వ సెక్షనుప్రకారము దావా తెచ్చుట కుత్తరువునిమిత్తము పిటీషన్నిచ్చినాఁడు-అది నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సీఫుగారు కొట్టివేసిరి-ఈకోర్టుకు, ట్రాన్స్ఫరైనతర్వాతఁ బ్రతివాదులు ముందుగా నిల్వనేరదను దానినిగుఱించి“యీప్రస్తుతపు దావా యొకటవ యార్డరు 8 వ రూలుప్రకారము కోర్టువారి యుత్తరవులేకుండ నిల్వదగినదేనా?”యను సారాంశ మెత్తుకొనిరి-మఱునాఁడీసారాంశమునుగూర్చి కొంతవఱకు వాదింపఁబడినతర్వాత వాది సంఘముతరఫున దావా తెచ్చుట కుత్తర్వునుగోరుచు 1 వ యార్డరు 8 వ రూలుప్రకారము పిటీషను పెట్టినాఁడు. 1911 వ సం॥ అగస్టు 28 వ తారీఖున నీయబడిన యుత్తరువులోని కారణములనుబట్టి యది కొట్టివేయఁబడెను-ఆదినముననే వాది తనయొక్కనిచేతనే ప్లెంటు దాఖలుచేయఁబడినట్లు సవరింపవలసినదని మఱియొకపిటీషను పెట్టెను-1911 వ సం॥ అగస్టు 24 వ తేది యుత్తరువులోని కారణములనుబట్టి యీప్లెంటు సవరింపఁబడెను-నర్సారావుపేట డిస్ట్రిక్టుమున్సీఫుగా రేర్పాటుచేసిన మొదటిసారాంశము మార్పునుబొందింపఁబడెను-విచారణనున్న సారాంశములు.

ఉ॥ ఇంతటిభేదముండినను నించుకయేనది యెత్తుకోక య
త్యంతము వారివాదముల నాత్మను నమ్ముట మెట్టినగజమో
సుంత వివేకమున్న మనుజుల్ గుఱుతింపక పోవ, రీతికే
యింతయబద్ధమున్న నిఁక నెంతగనుండెడి న్యాయ్యమంతటన్॥ 6

---

(1) ఈదావాగుళ్ళలో వాదివులను వారుమాత్రమే ప్రతిష్ఠచేయునధికారము కలిగియున్నారా ?

(2) ప్రతివాదులు 1306 వ సంవత్సరములోఁ బ్రతిష్ఠచేయుటవలన నపవిత్రకార్యముచేసినారా ?

(3) వాది తానుగోరిన యుత్తరువునకును నష్టమునకును నర్హుఁడేనా ?

(5) వాదిపక్షమున 14 మందియుఁ బ్రతివాదులపక్షమున 17 మందియు విచారింపఁబడిరి. విచారింపఁబడినయంశముల ఋజువుచేయుటకై సంస్కృతగ్రంథములు ప్రమాణములుగా నీయఁబడినవి. అవి క్రిందఁ జెప్పఁబడును. ఈదావా తీర్మానము కాకముందే మొదటిప్రతివాది కాలధర్మము నొందెను. వాది తక్కినప్రతివాదులమీఁద మాత్రము చర్యజరిపినాఁడు.

(6) మొదటిసారాంశము—ఈసారాంశములోని ముఖ్యాంశములమాత్రమే చెప్పిన బాగుగా నుండెడిని. ప్రతివాదులు విగ్రహములఁ దాఁకినందువల్ల నపవిత్రములై బ్రాహ్మణులకుఁ బూజానర్హములైనవని తిరిగి పవిత్రములఁజేయుటకుఁగాను వాది యొక్కఁడే సొంతహోదాతో నీదావా నడపినాఁడు. తాను విగ్రహములఁ బరిశుద్ధములఁగాను బూజార్హములఁగాను జేయు నధికారముగల హైందవసంఘములో నొకఁడైనందువలన నిపుడు తననిమిత్తమును దక్కిన బ్రాహ్మణవైశ్యాదులనిమిత్తమును జాల ధనమువ్యయపడిచేయు ప్రతిష్ఠ వ్యర్థమగును గావునఁ బ్రతివాదులు విగ్రహముల ముట్టుకొనుటచే నంటుపడిచినట్లు నిర్ధారణసేయవలసినదనియు నందువలననే పునఃప్రతిష్ఠకుఁ గావలసినద్రవ్యము వారివలన నిప్పింపవలసినదనియు వారు మరల గుళ్ళలో సంబంధము కలుగఁజేసికొనకుండులాగున నాజ్ఞాపింపవలసినదనియు వాది చెప్పెను. ఆయన బ్రాహ్మణుఁడననియు బ్రాహ్మణులకుమాత్రమే ప్రతిష్ఠాధికారము కలదనియు సంకీర్ణసంకరులైనప్రతివాదులకు మతగ్రంథములు చెప్పెడిప్రకారము గుళ్ళలోఁ బ్రతిష్ఠచేయుటకధికారములేదనియు వారు తాఁకినమాత్రాన మైలపోఁడునగును నక్రమముగాను నశాస్త్రీయముగాను వారు ప్రతిష్ఠచేయుటవలన

* తే॥ బ్రాహ్మణుండని పేర్కొనంబడెడిపదము
యాజనమె వృత్తిగాఁగల యార్యజనులఁ
దెలియఁజేయు నటంచని తెలియ కెవ్వ
రొప్పికొనిరో రికార్డునం దుండదెచట॥ 7

కం॥ జీవికయగు బ్రాహ్మణునకు। భావింపఁగ యాజనంబు, పదమునకర్థం
బావిధమునఁ జెప్పంజన। రేవారు నొకింత జ్ఞానమే యుండినచోఁ॥ 8

---

నగుణ్యముగా న్యాయమును బరిశీలింపవలసిన హిందూదేశములోని న్యాయసభలకుఁ బార్టీలు వచ్చినప్పుడు వారి నమ్మకముల ప్రకారము పోవుటకు వీలులేదు మతవిషయములోఁ దర్కముపయోగించుటకు వీలులేదని యొకప్లీడరు చెప్పినట్లు నాకు జ్ఞాపకమున్నది కాని యైనను న్యాయకర్తకు యుక్తియుక్తమగునా కాదా యని విచారించుట ముఖ్యగుణము గనుక నాగుణమును నేను నిల్పుకొందును.

(10) మతగ్రంథములను వానివాని తారతమ్యానుసారము తరగతులుగా నేర్పరిచుట యవసరము. 1 శ్రుతులు. 2 స్మృతులు. 3 పురాణములు. 4 ఇతిహాసములు. వీనిలోఁ బరస్పరభేదము కలిగినప్పుడు క్రిందితరగతి పైతరగతికి లోఁబడియుండవలె.

(11) మతసంబంధములైన పనులు బ్రాహ్మణులు చేయవలెననియు నవిషట్కర్మలనియు నవి యాచరించుటకు బ్రాహ్మణులమట్టుకే యధికారము కలదనియు వాది చెప్పుచున్నాఁడు. ఆయాఱుకర్మలలో నొకటి యాజనము. యాజనమునఁగా విగ్రహముల స్థాపన చేసి మనుష్యులయొక్క ప్రార్థనలకుఁ బ్రతీకారము చేయుటకై ప్రాణముపోయుటయై యున్నయది. ఈప్రతిష్ఠ యెవరు చేయవలసినదియు నేవిధముగాఁ జేయవలసినదియు నాగమములలోఁ బూర్తిగాఁ జెప్పఁబడియున్నదని ప్రతివాదులు చెప్పుచున్నారు. అదికూడ యాజనములోనిభాగమే యైయున్నది. యాజనాధికారముగలవారు ప్రతిష్ఠాధికారముకూడఁ గలవారైయున్నారు. ఏయాగమములు ప్రస్తుతోపయోగములో వేనిఁ బ్రమాణములుగాఁ దీసికొనవలయునో యందువిషయమై వాదిప్రతివాదులు భిన్నాభిప్రాయులై యున్నవారు. ప్రస్తుతము విచారింపవలసినవిషయము యాజనకర్మ మేకులము వారు చేయవలెననునది.

* (12) బ్రాహ్మణశబ్దము యాజనమేవృత్తిగాఁగలవారిని దెలియఁజేయునని పార్టీలొప్పుకొనుచున్నవారు. బ్రాహ్మణశబ్ద మెవరియందు సార్థకమగునో యది తేల్చుటమాత్రము కష్టము. మను ధర్మశాస్త్రములో బ్రాహ్మణేతరుల కెవరికిని

§ తే॥ బ్రహ్మకులమునందుఁ బ్రభవమందిన వాఁడు
బ్రహ్మమందు నిష్ఠఁ బరఁగువాఁడు
బ్రాహ్మణుండనంగఁ బరుసంబు నమరంపు
వ్యాఖ్య తెలియఁజేయు నరయుఁడుండు॥ 9

తే॥ చాల దిదికూడ బ్రాహ్మణశబ్దమునకు
బాగుగా నర్థముం దెల్పఁ బ్రాజ్ఞులార!
కాంచుఁడొక మాట మనుల స్మృగంధమందె
మీఁఱు బ్రాహ్మణశబ్దవిచార మీఁదు॥ 10

---

యోజనకర్మాధికారము లేదని చెప్పఁబడియున్నది. వాది తాను బ్రాహ్మణుఁడననియుఁ బ్రతివాదులు కారనియుఁ జెప్పుచున్నాఁడు. ప్రతిస్మృత్యధికారముకలవారని ధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణు లెవరని చెప్పవలె?

(13) బ్రాహ్మణశబ్దము తనకులమువారికే వర్తించుననియుఁ దానును దనకులము వారు మాత్రమే బ్రాహ్మణులనియు మనుధర్మశాస్త్రమందుఁ జెప్పబడిన బ్రాహ్మణులు తమ రేయనియుఁ గాకపోయినచోఁ దముపూర్వులు బ్రహ్మణశబ్దముచే వ్యవహరింపఁబడరనియుఁ బ్రతివాదులు బ్రాహ్మణులుగా వ్యవహరింపఁబడక మఱియొకరీతి వ్యవహరింపఁబడుచున్నందున వారిని బ్రాహ్మణులఁగా నెంచుటకు వీలు లేదనియు వాది చెప్పెడిని. మనుష్యుఁడు తాను వ్యవహరింపఁబడుదానినిబట్టి గాక తన నిజస్థితినిబట్టి విచారింపఁబడవలసియుండును గావున వాది సామాన్యముగా బ్రాహ్మణుఁడుగా వ్యవహరింపఁబడినను వాస్తవమునకుఁ గాఁడని చెప్పుచుఁ బీటరనిపిలువఁబడువాఁడు మొదట జాలయినను దాఁ జెప్పుకొనుదానినిబట్టి లోకము పీటరని పిలువక తప్పదని దృష్టాంతప్రదర్శనపురస్సరంబుగఁ బ్రతివాదులు వాదించుచున్నారు. ఈవివాదముయొక్క పర్యవసానమిట్లు నామాటలతోఁ జెప్పనయ్యెను.

(14) వివాదపర్యవసానమేమనఁగ? మనుస్మృతిలోఁ జెప్పఁబడిన బ్రాహ్మణుఁడు బ్రాహ్మణకులములో జాతమాత్రుఁడైనా లేక బ్రాహ్మణుఁడు చేయవలసినకర్మల నుండవలసిన గుణములు కలిగియున్నవాఁడా యనునది. వాదిప్రతివాదు లుభయులు

---

§ గురుబాలప్రబోధిక ద్వితీయకాండము బ్రహ్మవర్గము
బ్రహ్మణి పరబ్రహ్మణి నిష్ఠావత్త్వాత్ బ్రాహ్మణః బ్రహ్మమందు నిష్ఠగలవాఁడు
బ్రహ్మణః కులే భవత్వాద్వా బ్రాహ్మణః బ్రహ్మకులమందుఁ బుట్టినవాఁడు.

కం॥ తత్తత్కృతికరణార్హులు। తత్తద్గుణములలట్టి ధన్యులె కాపి
రిత్తగు బ్రహ్మణలాదిక। మిత్తఱిఁగలవారు కాక యెన్నఁగ ననుచున్ ॥

కం॥ దృష్టాంతపూర్వకంబుగ। స్పష్టంబుగ వ్రాయఁబడిన జడ్జ్మెంటునొగిన్
గష్టమనక పఠియించినఁ। దుష్టులుగాకుండ రెవరుఁ దోడ్తోమనలోన్ ॥

కం॥ గుణములె ప్రధానమై త
ద్గుణయుక్తులె కొన్ని క్రియలకుం జాలెడిచో
గుణగణములను బట్టి క్రియా
గణములనె సృష్టింపవలయుఁగద ప్రథమమునన్ 13

ఆ॥ అట్లుకాక బ్రాహ్మణాదివర్ణంబుల
నెందుకేరుపఱిచె నీశ్వరుండు
వేరుపడినకులము లేమిప్రయోజన
మాచరించినట్లు లరసిచూడ॥ 14

---

లును మనుష్యులని యెంచఁబడుటకు సమానాధికారముగలిగి యున్నవారు. ఒక పనిచేయుటకు వారికిఁ బ్రత్యేకమధికారముండి ప్రతివాదులకు లేకపోవుటయనునది యాపనిచేయుటకుఁదగిన యోగ్యత వారియం దుండియుండుటవలననై యుండవలె. మనుష్యుని సత్తననుసరించి విధులేర్పడినవి కాని విధులు ముందేర్పడి యందునిమిత్తమై యామనుష్యుఁడు సృష్టింపఁబడలేదు-భగవంతుఁడు సృష్ట్యాదిని విధుల ముందేర్పఱిచి యందునిమిత్తమైన మనుష్యులఁ దరువాత నేర్పఱిచినాఁడన్నను నట్లుచేయుటయందుఁ దనకుఁగల యుద్దేశమునునుసరించియే చేసియుండవలె. అట్లేర్పడిన మనుష్యులా యుద్దేశితమైన పనుల కవసరమగు యోగ్యతలుగలిగియుండవలెను-స్థూలాకార మందఱికి నొకవిధముగానే యుండును గావున నీగుణములు మానసికములును నీతికిని మతమునకును సంబంధించినవియుఁగా నుండవలయును-పూజార్హములగు విగ్రహాదులకు సంబంధించి యుండవలసిన మతవిషయములో మనస్సును నాత్మనే చూడవలయును గాని చర్మచక్షుర్గోచరమగు స్థూలాకారమును జూడఁగూడదు- ఈ హేతువులనుబట్టి బ్రాహ్మణశబ్దము గుణవద్వాచకమగుఁగాని జాతివాచకము కానేరదు- బ్రాహ్మణత్వ వ్యవహారమాత్రము బ్రాహ్మణశబ్దము సార్థకముకాదు- ఈప్రకారము మతసంబంధకార్యముల నెరవేర్పుట కుండవలసినగుణములును మతవిషయమగు నధికారమును నొకవర్ణ్య



# శుద్ధాంధ్రహరిశ్చంద్రచరిత్రము.

## ప్రథమాశ్వాసము.

చ॥ సిరిగడియించి తండ్రియనుచెల్వొన వేల్పయి యీగిఁ బ్రొద్దుచూ
ల్పురుఁడయి రాయవర్పుఁగొలవుంబెనుసంద్రపుఁ జందమామయై
గరుసును వెన్నునింగొలుచుకర్జము నత్తెము వీడకుండఁగాఁ
బరఁగిన వీరరాఘవుఁడు ప్రాపయి ప్రోవుతనన్ను నిచ్చలున్॥

ఉ॥ పుట్టువు పెంపు మిత్తి గల ముజ్జగముల్ దనలోననుంచి మేల్
మెట్టుచు మేనిదాల్పులకు మేరలొసంగుచుఁ గన్నతల్లియై
యిట్టటులెంచరానినైన రెంతయుఁబూనిన వెంకమాంబ యి
క్కట్టులనెల్లఁ బోనొడిచి కావుత సత్తిగొనాలమిన్న నన్॥ 2

మ॥ వరుసన్ మాటల గల్గులన్ గెలువులన్ వాసింగనంగూర్చు చ
బ్బురమానత్తుల కన్నమేనులను నింపుల్ గుల్కఁగాఁదాల్చి దే
వరమైక్రాలెడి నిండువెల్గు పలుకుల్ బల్పిర్ల మేల్పత్తువల్
తిరమానట్టుల నన్ను నేలుతఁ గడిందిన్ నిచ్చలుం బాపుచున్॥ 3

ఉ॥ మానిసు లేనిఁ దొడ్డొలుత మానకగొల్తురు ముజ్జగంబులం
దేనికమోము చేతనెవఁ డెంతయుఁ గ్రాలెను గట్టుపట్టి యొ
వ్వానిని ముద్దుపెట్టుకొని పాయనిప్రేముడిఁజూపుచుండు నెం
తేనియుఁ గర్జపుంజెరుపు లేలునెవం డతనిం దలంచెదన్॥ 4

మ॥ కడలిన్ దాటినమేటి రక్కసుల ప్రక్కల్సేయుమేలీటి నె
క్కుడుకన్ వేలుపుసామిసాటి నుడివాల్గొన్నట్టిజేజేలరా
యుడుగుందమ్ములఁదేటిఁ గీడుగమి డయ్యన్ వేల్పునూర్లున్నచీ
టి దొగర్దేర్చెడిసూటి గాలికొడుకున్ డిల్పాటుఁగో వేఁడెదన్॥ 5

ఉ॥ చిన్నతనంబునం గయితఁ జెప్పెడి నేర్పునొసంగి విద్దెలం
దన్నిటఁ మిన్నవాడవని యాదటమీఱఁగ నానతిచ్చి నన్

వన్నెకుఁదెచ్చి శొంతియనువంగడమందున వెల్గు రామభా
ప్రె న్నెనరుంచఁగొల్చెద మదిం దిరమైతగు నెజ్జబత్తిచేఁ॥ 6

ఉ॥ కాఁపురమర్ దోసంగుగమి గాంచక మూఁడుగోనాల కావలర్
బాపగునిండువెల్గుఁగని పాయనిసంతస మొందఁజేయు నా
యోపిక పేర్మిఁ గోసిడినయొజ్జను నాపినతండ్రిఁదాల్చిచే
నేపగువంగడంపునెల నెమ్మదుఁ గొండలరాఁపు నిత్తెముల్॥ 7

చ॥ తెనుఁగున నచ్చతెన్గున దేటగు వేలుపుబాసఁ గబ్బముల్
పొనరఁగ వెన్క నిప్పుడిఁకముందటఁ గైతముగూర్చు పెద్దలర్
నెనరునఁ దప్పులంగనక నిగ్గులనే కనుచుండ వేడెదర్
బనివడి దోసము ల్వాదకు వారలజోక్యము నాకిఁ కేటికిర్॥ 8

వ॥ ఇత్తెంబులగ్గులొసంగుటకు నాయొనర్పంబూనిన సత్యహరిశ్చంద్రు చరిత్రమునకు వ్రాయ మొదలు నట్టి దిట్టతనంబగు నెమ్మదిమండునంత

సీ॥ సైరణచేత నిజ్జగమునఁ బొగడంగఁ
బడి తేగమున గొప్పపరువుదాల్చి
సత్తుచేఁ బేరొంది జమునూడు గొల్వంగ
నిత్తెమా నెమ్మదిబత్తిఁ గల్గి
అల బాఁపనుల బోనాలచేఁ దనియించి
పెద్దలఁ బిన్నలఁ బ్రేమఁ బెన్చి
గడియించు నేర్పునఁ గడిమిగలాఁడునై
యన్నయానతిదాట నగడుఁ జెంది
మూలపే టనుపల్లెలోఁ జాల ననము
వెలయఁగా రాయవరపనుకొలమునకును
దివ్వెయై వీరరాఘవదేవరదగు
నన్నుఁగన్నట్టివాఁడు గొనాలమిన్న॥ 10

చం॥ అతఁడొకనాఁడు పాదుకల నక్కజమొప్పఁగఁ గానుపించి "కూ
వతనముచేతఁ గబ్బముపొనర్పఁగఁ జూచెదు, బామొ, యైన సి

జతనము నసందు సాయపడి సాగఁగఁ జేసెదఁ బట్టివాట, నే
కత దెసఁగింతొ యొందె నను గాదకుఁ దొల్లను బేరుకొమ్మిగిఁ

చం॥ కొడుకవు నీవు, నిన్నుట కోరిక తెల్లను నావి పండఁగాఁ
బనుట యొకొం దె, తండ్రి పెరవాఁడొకొ వేలువుగాక, యెంచఁగా
బుడుతవుగావు నీ కెఱుక పో, యదిగాక యు నాదు పేరు నీ
వెడఁదను గొల్చు వెన్నుని దె, యెన్నుము నన్నటు గ్రానఁ దొల్తఁగాఁ

ఆ॥ ఇదియుఁగాక వినుము యింకొక్క యుబ్బింబు
నీకుఁ గూఁతుసంతె నెగడఁగాని
కొడుకుసంతు లేదు, కొమరుసిగ నుసట్టి
చెలువుగూడదీనఁ గలుగదు,, సనియె 4

మ॥ అని యిట్టుల్ కలగాంచి మేలుకని నా కయ్యారె! నా తండ్రిఁ గ
న్గొను మేల్కొని రెనేఁటికంచు బలు కుల్కొఁ జెంది యే నెన్న వె
న్ననుముచ్చిల్లెడి నల్లవాఁడె యిటు గానక వచ్చెఁ గన్నట్టియా
యనఁగా నంచును బత్తి సంతసము లొంద్దై మురిపించి పొందఁగాఁ 14

కం॥ కలనైన నిజము దప్పని
బలుతోడసి పేను వడయు వానికి తక నేఁ
దెలుఁగింతు నంట, తండ్రిని
తొలుతం గొండాడుదు నంటదోసము లన్న 15

తే॥ తండ్రి పల్కులు నెర వేర్పఁ దడయుకుంట
యనము లగ్గులు నొందించునది యగాన
కన్నయాతనియానతి గడవకుండి
తొలుత నా వంగడం బెన్నుదును గడంక॥ 16

ఉ॥ తాలిమిమీఱ నీలయనుతామరకంటియు నేల చేసయుఁ
గ్రాలుచు నంజదమ్ములఁ దిరంబుగనొత్తఁగఁ బాల వెల్లిలోఁ
దేలినమట్టియాకుపయిఁ దేజన నిద్దురవోవుచుండు వే
సాలు పందింటి దాలిచినసామికిఁ బొక్కలిదమ్మి వింతగాఁ 17

సీ॥ నలు మొగంబులఁ దోలిపలుకులనాల్గింటి
పొరముదప్పక చెప్పు బిరుదువాఁడు
పాటలుఁబద్దెముల్ పరఁగువిద్దెలు రెండు
పాలిండ్లుగలయింతి నేలువాఁడు
నలువుగా నొడలిదాల్పులమూఁకఁబుట్టించి
నొసళులవ్రాఁతల నొసఁగువాఁడు
తెలి వినుదిమ్మర్రితేజిపై మసలుచుఁ
దమ్మిగద్దెను గొల్వుదాల్చువాఁడు
బమ్మ తెరగంటులకుఁ బెద్ద తమ్మిచూలి
తాత తగవులజడదారితండ్రి నల్వ
నిక్కువపుజగము నేలెడి నేర్పుకాఁడు
పుట్టు తనయంతగలిగిజెట్టి పుట్టు॥ 18

క॥ అట్టినలువ మజ్జగములఁ
బుట్టింపఁగ నొదవిరవుడు మొగము బుజములన్
గట్టడగఁ దొడల నడుగుల
బెట్టుమగలు పార్లు ఱేండ్లు బేరులు కాఁపుల్॥ 19

క॥ ఆనాల్గుమేనిదాల్పుల। లో నెంతయుఁ బార్లు వేల్పులుగఁ బలుకుబడిన్
బూనిరి, గౌతముఁడందులఁ। గానయునికిపట్టఁ బెద్దగా గసముగొనెన్ ॥20

సీ॥ దోసాలతిట్టలఁ దోలఁగించునీర్వాని
వెలయువాఁక జగాన నిలిపె నెవఁడు
సొగసుదియనుమరుల్ చూఱఁబుచ్చియుఁ దప్పఁ
జేయునాలిని రాయిఁ జేసె నెవఁడు
వెన్ను నేడవపుట్టు మన్ననవడసిన
బంటుతల్లిని గన్నవాఁడెవండు
తనకుఁబుట్టిరో లేదో యని పట్టి దుగనేటఁ
ద్రోసి కోఁతులుగాఁగఁ జేసె నెవఁడు

అట్టిజడదారి గోత్రము నమరఁగుకోలము
బంతిలో రాయవరపు వంగడంబు
డంబుగను గాని సిగి కడ్డంకి లేక
తోడరు బిరుదుముగలును మంతురులు వెలయ॥ 21

ఉ॥ అందల నెప్పెఁ బ్రెగ్గడయు నంతటిబంధులవిందు వెన్ననే
నిం దగఁ దేర్చు మనసిం దెగడందగు మేనిగున్నయు
బ్బొందఁడు కీడుఁజూపఁ డుడుకు తలవాటులు సున్న సుబ్బరా
వందులనిందులం దిరమునందినకీర్తిగన్న మేటియై॥ 22

సీ॥ బాసలెన్నియొపల్కఁ బ్రాయమునుజనువను
బలునేర్పుగలిగిన బల్లిదుండు
పగఱనందఱ నసిఁ బరిమార్చు కైదువ
పోడిమియొఱఁగిన నాఁడెకాఁడు
కలనైనఁ బెరబోఁట్లఁ గన్నవారిఁగనెంచి
లాఁతి పైఁడియుటన్నఁ జేతఁగొనఁడు
పేదలకిడుటన్న లేదు కేలునకు నె
మ్మొగతాళి కైన బొంకెఱుఁగఁ డెప్పుడు
పలికలకెల్ల మేఖలఁ జాలఁగూర్చి
ప్రెగ్గడలలోన మిక్కిలి పేరుపడసి
అందఱకు నోటిలో నాల్కయట్లు కలసి
మెలసి యాసుబ్బరాయండు చెలఁగుచుండు॥ 23

సీ॥ ముమ్వేల్పుమిన్నల పుట్టులకెక్కయా
బమ్మతోనైన నేర్పరియనంగ
ప్రొద్దుచూలీరీతిఁ బుట్టొంటెనోయని
బిచ్చిగాం డ్రందఱుఁ జేర్మిఁబొగడ
తాతవ్రాఁతకుఁ దోటుదగుఁగాని యితని య
క్కరమునఁ గొదవ పేదరికమనఁగ

ఓరుపు మొగరూపునాండెనోయని చూప
ఉలకెల్ల సంతసంబొలుకుచుండ
తేజు నేమంబు నిక్కంబు తెగువ మంచి
యడఁకువయు నొక్క మేనినై యడరెననఁగఁ
గిరితిని సుబ్బరాయండు పేరువడసె
మానిసియె వేలుపతఁడు జగానఁగాని 24

ఆ॥ అట్టిసుబ్బరాయఁడనుఁగుగాఁ జేపట్టె। శంబమ నెడిముద్దుచానవోర్తు
ఆమె నేలకూన నైనగుబ్బలిపట్టి। నైన మెచ్చునట్టియున్నగరిత॥ 25

కం॥ వల్లూరిపేరుగలవు। ట్టిల్లను మెట్టినయునంపుటిల్లును వాసిన్
డిల్లపడకుండసిరులన్। బెల్లుగ శంబమ్మమనిపి పేరును గాంచెన్॥ 26

సీ॥ మగనిసామేన నిల్పుగొనంబు లేకున్నఁ
జలిగట్టుచూలామెన వత్తువచ్చు
ఇంటింటఁ బెఱవారి నెనయూట లేకున్నఁ
బుడమిచూలామెకుఁ బురుడువచ్చు
బాసలలోఁ బలుపాట్లఁ బొందకయున్న
బొమ్మచేడియ యామెఁ బోలవచ్చు
మేను లేనట్టి పెన్మిటిఁ బొందకుండిన
మరునిముద్దియ యామె మాఱుదివచ్చు
ననుచుఁ దనపాటిపువుబోఁడు లనుకొనంగ
నవ్వుమొగమును జిన్నారిపువ్వుమేను
మంచిగొనములు పజల మన్నించునేర్పు
గలిగి శంబమ యలరె లగ్గులు చెలంగ॥ 27

కం॥ ఆసుబ్బరాయశంబమ। లీసిసుమంతైన లేని యిరుకొమరులబల్
వాసిగఁ బడసిరి కోంటెలు। వేసర సంజీవరాయవీత్రాఘువులన్॥ 28

తే॥ వరుసలేమిని నొకరంగువారుగామి
బంతి తేరులకోపట్ల పసను దెగడి

కన్నదొక్కటియూట నిక్కంబుగాఁగఁ
గ్రాలె సంజీవవీర రాఘవుల జంట॥ 29

కం॥ గొనముల మేనుల గుర్తుల
ననువుగలుగువారె, యైన నొఁ బుట్టువు వే
అని కట్టినలువు వేల్పుల
తనివిగొనదు రెండు లేనితనమున వారల్॥ 30

ఆ॥ కన్న వానిఁ జోడఁ గయ్యమాడక యున్న
నిరువు రొక్క మాటుపొరయకున్నఁ
బుడమిఁ గొమిరెపల్లె పురుడగు సంజీవ
రాయసరుసను వీర రాఘవునకు॥ 31

సీ॥ అన్నమాటకు మాఱులని పగనొందిన
బొగవదికంటి సైదోడునెన్ని
కొలముకట్టడ మానుకొని కన్న వానిన
దూఱుపరోంబువ్వచాలద్ధారి నేటి
పాటఁ బాడుచు బత్తిబరఁగిన ట్లాడెడి
కయ్యంపుఁదినుబోతుఁ గాసిఁ జేసి
నేమంబుదిగనాడి నీచురాలిన పొందు
కావిగోచుల సామి కలిమినులిమి
పలుకుదిరమును నేమంబు తెలివి గరుసు
గలిగి చెలిమియుఁ గూర్మియుఁ జెలువ మొఱపుఁ
జెలఁగఁ గ్రాలుదు రెప్పుడు సంజీవరాయ
వీరరాఘవమంతురుల్ బీరమునను 32

కం॥ ఆయుద్ధతిలోఁ బెద్దయి
యేయెడ సంజీవరాయఁ డేపుమిగిలె, న
బ్బా! యితఁ డెంతటిబలుగనుఁ
డో యని పజలెల్లఁ బొగడ నోపికగనిమ్మై 33

సీ॥ వ్రాసెనా వెయికలాల్ వరలుచెల్వొనవ్రాయు
నక్కరంబులు ముత్తియములఁబోల
చదివెనా పసివాఁడునయితము తెలిసికొ
నంగ నక్కాణ మొఱుంగఁజేయు
పల్కెనా రచ్చలో బలిరా!యనంగ మేల్
పొత్తాలడోరణి పొత్తుపఱచు
కాంచెనా చూపఱుల్ గట్టివాఁడితఁడంచు
నెంచ యొప్పుఁజూపు నెనయఁజేయు
మూలపేటను వెలసిన యోలగాప
రిని జగన్నాథుఁ గొల్చి కోరికదలర్చ
నెదకుఁ బెరచూపులేని యింపొదవఁగూర్చి
యడరెసంజీవరాయప్రెగ్గడసతంబు॥ 34

కం॥ సంజీవరాయఁడల సిరి
కిం జతగ వరమ్మ యనఁగఁ గెరలు ముగుదమి
న్నం జేపట్టెను మఱపను
నంజయిరులగములఁగలఁచు చందురువెల్గుల్॥ 35

కం॥ ఆయన కాపెకుఁ బుట్టిరి
నాయము చేవాసికెక్కి నమ్మినవారిన్
జేయూఁతనిచ్చి మనుపఁగ
వాయిచెడనివారు ముగురు పరువగుకొడుకుల్॥ 36

తే॥ జగములో సుబ్బరావన సాంబమూర్తి
యనఁగ హన్మంతరావన నలరిరి ముగు
రొప్పువారన గొనముల మెప్పువారు
ననఁగఁ బెంపుమిగనుచు మేలెనయఁగలిగి॥

కం॥ ఆముగురఁ బెద్దవాఁడై సామిదియూనింగిలీషుచదువునగనియై
బామెవరిపోఁకకుండఁగ నోమెఁబజలసుబ్బరాయఁడొప్పగుపేరన్॥ 4

# శ్రీ సనాతన ధర్మ మార్గము.

## వర్ణవ్యవస్థాత్మక ప్రథమసోపానము.

ఈమార్గము సకలసనాతనధర్మానుష్ఠాతృజనానందసుఖసంధానసంవిధానావధానియగు పరమేశ్వరుని యాజ్ఞానుసారముగా సనాతనధర్మమార్గనిర్మాణచాతురీధురీణులగు మను, యాజ్ఞవల్క్య, వసిష్ఠ, భరద్వాజ, పరాశర, వ్యాసాగస్త్య, నారదాది మహర్షిపుంగవులచే నిర్మింపఁబడినది. "సనాతన శాశ్వతమైన, ధర్మ లోకముల నెల్లధరించు లేక లోకములచే ధరింపఁబడు, మార్గము సాధనము" అనియర్థము. దీనివలన ధర్మదైవతములకు భేదములేదని బోధమగుచున్నది. అట్టి సనాతనధర్మమార్గము నారోహణము జేయుటకు సనువుగా వర్ణాశ్రమాచారములను నిరపాయములైన సోపానములుగూడ నిర్మింపఁబడియున్నవి. వీనికన్న మిన్నలైన సోపానములు లోకములనెల్ల గడిగి గాలించినను గానరావు. ఇది సత్యమని పరదేశపండితమండలాఖండలులుగూడ నుడివియున్నారు. వినయములుండు మనసోదరులలోఁ గొందఱు పరసోదరుల బోధలకు లోనయి సంఘసంస్కర్తలను పేరిడుకొని "తాఁజెడ్డకోతి వనమెల్లఁజెఱిచె" నన్న లోకోక్తిని సార్థకము జేయఁ గంకణముకట్టుకొని పైనఁదెల్పినసోపానముల నెల్ల మొదలంటఁ దీసివేసి మన మొక్కసారిగ సౌధముపై కెగయుదమని యుపదేశించుచు సోపానములను నిర్మూలించుట కుపక్రమించియున్నారు. కాని వారి నిర్మూలనసాధనము లత్యల్పశక్తికలవగుటచే వానిని మొదలంటఁదీసివేయుటకు సమర్థములుగావు. కాకపోయినను వారిప్పుడే సోపానములయందచ్చటచ్చటఁ గొన్ని మఱుంగులను బెట్టియున్నారు. కావున సనాతనధర్మమార్గారోహణతత్పరుల మెల్లరము మన సంస్కారసోదరులఁ బారఁద్రోలి యీ సోపానములను సంస్కరించుకొని కాపాడుకొనవలసియున్నది. అందులకై మా యోపినరీతిసంగ్రహముగా సోపానసంస్కరణాత్మక విమర్శనగ్రంథములను వ్రాయఁబూనితిమి. కాన సనాతనధర్మాభిమాను లందరును మాయుద్యమమునకుఁ దోడ్పడి మాగ్రంథముల నాదరించి సనాతనధర్మోద్ధరణము గావింతురుగాత.

ఇట్లు, సనాతనధర్మాభిమాన విధేయులు.

# ప్రశ్నార్ణవాపోశనము.

సుజనవర్యులారా!

ఇది కలికాలముకదా! కలి, తనప్రభావమును నలుగడల వెలిగింపఁదలఁచి ధర్మముల నధర్మములఁగాను నధర్మముల ధర్మములగాను బోధించు బోధకులను సిద్ధముసేసి లోకమునం దెల్లెడలను వారిని బ్రవేశపెట్టియున్నవాఁడు. వారు కలి కటాక్షమున నఖాండిత్యమునందును, లోకవంచకత్వమునందును, ననన్యసామాన్యశక్తులను సంపాదించినవారలు కానఁ దమమతమున కెదురైన పండితుల నెల్ల బూతులపాండిత్యమున నోడించుచుఁ గలిమహాపురుషుని కోరికలఁ గొన్నిటిని గొంతవట్టు గొనసాగించుచున్నవారు. కవిరాజునకుఁగాని, యాతని సేవకసముదాయమునకుగాని, మన సనాతనధర్మముల నిర్మూలించుటయే ముఖ్యకర్తవ్యమైయున్నది.

అందులకై వారు పలుసమాజరూపముల ధరించి నలుదెసలఁ బరిభ్రమించుచున్నవారు వారి వేషభాషాచారములలోఁ గొన్నిటినిఁ గ్రమముగా నీదిగువ నుదాహరించుచున్నవారము కాన వీని సావధానమానసములఁ బరికించి సత్యసారమును గ్రహింతురుగాత.

## కలిచోదిత మతములు.

ఇవి సనాతనధర్మనిర్మూలనమునకుఁ గంకణముఁగట్టుకొని కొన్ని శతాబ్దములనుండి పనిఁజేయుచున్నవి. వీనిలో మొదటిది మహమ్మదీయమతము. ఇది బోధను వెనుకను బాధను ముందును నిడుకొని ప్రవర్తించుటచేఁ దానే యోడిపోవలసివచ్చెను.

అటుపై నాపనిమీఁదఁ బయలువెడలిన రెండవమతము క్రైస్తవము. క్రైస్తవమతనతీతిలకము పైదానివలె బాధను సాధనముగా నిడుకొనక శాంతమును బూని తన వన్నెలఁ జిన్నెలఁ జూపుచు ధనాశఁ గొలిపి మన హైందవ సోదరులలోఁ గొందఱ వ్యామోహితులఁగావించి యా ధర్మచ్యుతులగువారితో సంయోగసంతోషమనుభవింప మొదలిడెను. అటుపై సనాతనధర్మపరాయణులు తమసోదరులు పరసోదరత్వమును వీడి కామాయత్తులై చరించుట కని విషాదమునుఁ

బొంది సోదరీసంగమము నరకహేతువని బోధింపసాగిరి. తొలుతఁ దెలియక చెడినవారు చెడినను దరువాతివారు పెద్దలయుపదేశముల ననుసరించి యీ పెడత్రోవను గన్నెత్తిచూచుటకుఁగూడ నోడిరి.

తరువాత నాక్రైస్తవమతవనితామణి తనప్రయత్నము విఫలముగుటకు వ్యసనపడి చలమూని తానిఁకఁ గపటోపాయము నాశ్రయించి మారువేసములవేసినఁగాని తనకోరికలు గొనసాగవనియెంచి హిందూసుందరీసంబోలు వేదశాస్త్రాచారవిరుద్ధప్రవర్తనముగల బ్రహ్మసమాజమను భూమికను దాలిచి "నేను మీజాతికన్నియనేకాని యన్యకన్యనుగాను గాన ననుఁగూడి సుఖింపుఁడ"ని బోధించి లోకజ్ఞానశూన్యులగుమనబాలురఁ గొందఱిఁ దనవలపను వలలోనఁ జొనుపుకొనఁజొచ్చెను. అటుపై మనలోని ధర్మజ్ఞులామర్మమునుఁ గనిపెట్టి తనసోదరుల కాగుట్టుఁదెలిపి సోదరివేషము వేసినంతనె దానిఁగూడి కూడిక నరకహేతువు కాకపోదని ఘోషింపసాగిరి. అంతకుముందే చెడిపోయినవారు పోయినను మిగిలినవారామెఱివిని యీబ్రహ్మసమాజకన్యయెడ సామాన్యబుద్ధినహించి విరమింప మొదలిడిరి.

పిదప నాక్రైస్తవమతసతీమణి కామరూపిణికావున నాభూమికను నట్లుంచియే కపటపూర్వకముగ వేదశాస్త్రాచారవర్తనముగల యార్యసమాజమను వేషమును వేసికొని నిష్కపటవేదశాస్త్రాచారాభిమానులగు హిందువులలోని కొందఱుసోదరులను స్వకటాక్షానుచరులనుఁ గావించుకొనెను. ఆపైనఁ బూర్వాచారపరాయణులా యార్యసమాజకన్యకయొక్క కృత్రిమచర్యలనుఁ దెలిసికొని తమసోదరులకు వానిని విప్పిచెప్పసాగిరి. అందువలనఁ దనమనోరథ మీడేరమినిఁ గనుఁగొని యాక్రైస్తవమతలలనాలలామ యీ యార్యసమాజవేషమును నట్టుంచి "దివ్యజ్ఞానసమాజము,, అను దివ్యసుందరవేషమును వేసికొని తన (ఎవరెవరి వేదశాస్త్రానుకూలములగు జాతిమతాచారములందు వారు వారుండి యొక జ్ఞానజిజ్ఞాసఁ జేసికొనుసమయమునందుమాత్రమె యందఱిదివ్యజ్ఞానసమాజము) తోఁ గూడుచుండుఁడని కోర మొదలిడినది. పరభాషాపండితులగు మనసోదరులీ లాకలికిపలుకుల విని యావలపులబోటి

కూటమివలనఁ దమ కేవిధమగునష్టమును లేదని భ్రాంతిపడి యావిద్య నందరినిఁ బొందుట కారంభించిరి. అట్లు పొందినవారలలో మొదటని న్నఁదగినవారు శ్రీయుత జిడ్డు నారాయణయ్యరుగారు. వీరాదివ్యకుంద రదనపొందునఁ బొందఁగోరి తొలుతఁ దనపుత్రులనుగూడఁ గానుకగా సమర్పించి యామెతోఁగూడి సుఖమనుభవించి యాసుఖము పయో ముఖవిషకుంభమువలెఁ గన్పడి తనను బాధించినంతోడనె తోడిసోదరుల మేలుఁగోరి యావిషయమును జగద్వ్యాపనముఁగావించిరి. అందువలన సామాన్యజనులకందఱికి నాదివ్యసుందరిమీఁదనుగూడఁ గామము సన్న గిలసాగెను.

అటుపైఁ బైనఁదెలుపఁబడిన కన్యలకొఱకయి తమతమమతము లనుండి విడివడిపోయిన యాకాముకులు వెనుకకుమరలుటకిష్టముండి నను వీలులేమి లోకమునుఁ దమలోకమునఁ జేర్చుకొనుటకై మొదల సంఘసంస్కరణపక్ష మవలంబించితిమని సత్యాచారములఁ దెలుపు శాస్త్రప్రబంధముల (ఉపన్యాసములను, వ్యాసములను) వినిపించి దానివలనను ఫలమునుగానక యెట్లైన నాయాచారముల సంఘమున నెలకొలుపవలయునని యెంచి దృశ్యప్రబంధములు జనాకర్షణసమర్థము లనితలఁచి యాసమాజకాముకుల స్త్రీపాత్రలనుగానిచుకొని సంఘసం స్కరణనాటకములలోఁ బ్రధానములనఁదగిన (1) ఏకజాతి (వర్ణసాం కర్యము) (2) రజస్వలావివాహము (3) విధవావివాహము (4) విదేశ గమనము (5) నిమ్నజాత్యుద్ధరణము, అనెడి యైదునాటకములను నా డుటకుఁ బ్రారంభించిరి. ఇవియుఁ బండితాసహ్యకరములై సంఘవినా శకారకములై యుండుటనుబట్టి సామాన్యజనులుగూడ వానియెడ విముఖులైరి. అగుచున్నారు. కాఁగలరు. కాని సామాన్యజనోప కార్థమై ప్రతివాదులవాదములను నిరసించుటకుఁ బూనుకొని మనము వారియుపన్యాసములకుఁ బ్రతిగాఁ విమర్శోపన్యాసములను జేసియు, వారివ్యాసములకుబదులుగాఁ విమర్శనవ్యాసములు వ్రాసియు, వారి గ్రంథములకు వ్యతిరేకముగా విమర్శనగ్రంథముల రచించియు మనప్రతి వాదులతోఁ దలపడి పోరాడి సనాతనధర్మోద్ధరణము గావించుకొన

వలసియున్నది. ఆపని నుపక్రమించి నా యోపినంతవఱకు నుపన్యాసములఁ జేయుచు వ్యాసములను వ్రాయుచు నిపుడు శ్రమచేసి సంస్కరణనాటకవిమర్శనగ్రంథములను వ్రాయఁబూని యందు మొదటిదగు "నేకజాతి" నాటకవిమర్శనమనఁదగు నీ

ప్రశ్నార్ణవాపోశనము.

అను చిన్నిపొత్తమును రచించితిమి. ఈపుస్తకము "ప్రశ్నార్ణవాపోశనము" అను పేరువడయుటకుఁ గారణము కొందఱకుఁ దెలియక పోవునేమోయని తలఁచి యావిషయ మిందుఁ గొంత విన్నవించుచున్నవారము.

పూర్వమున రక్కసులు సముద్రమున దాగియుండి దేవతలు పరాకుననున్నతఱి వారిపైఁబడి బాధించి వారెదిరించినఁగోడనే పరుగిడి పారావారమున మునిగియుండ మొదలిడిరి. దానవసురలాయసురుల రూపుమాపలేక బాధలకుఁ దాళఁజాలక యగస్త్యమహామునిపాలికిం జని పాదములపైబడి రక్షింపుమని వేడిరి. ఆపు డాశ్రితావనతత్పరుండగు నామహర్షి దానవులు దేవతలచేతఁ బడుట కనువుగా "అర్ణవాపోశనము" గావించెనను కథగలదుగదా? కలదు. అట్లే ప్రశ్నార్ణవమున దురాచారరాక్షసులు దాగియుండి సనాతనధర్మదేవతలనఁదగు సామాన్యజను లేమరియున్నతఱి వారిపైఁబడి బాధింపసాగిరి. ఆబాధలు పడలేక వారీగ్రంథాగస్త్యమహర్షి శరణుఁజొచ్చిరి. శరణాగతరక్షణదీక్షాపరతంత్రుఁడగు నీగ్రంథాగస్త్యుఁ డాదురాచారరాక్షసులు ధర్మదేవతాపరావతారులనదగు సామాన్యజనులచేతఁ బడుటకై ప్రశ్నార్ణవాపోశన (ఖండన) ము గావించియుండుటచే నీగ్రంథరాజమునకుఁ బ్రశ్నార్ణవాపోశనమని పేరువచ్చినది

ప్రశ్నార్ణవము.

చరిత్రఁదెలియని సామాన్యజనులకుఁ "బ్రశ్నార్ణవాపోశనగ్రంథపఠనమువలని ప్రయోజన మంతగాఁ గానరాదు. అందులకై ప్రశ్నార్ణవచరిత్ర సించుక నిట వ్రాయుచున్నారము. ఇయ్యది హిందూపురనివాసులగు శ్రీమ దార్యనారాయణమూర్తిగారిచే రచింపఁబడినది. ఇందు

జాతులు మృగములందు నిత్యములును వర్ణములు మానవులందు గుణకర్మానుసారముగాను నుండునని శ్రుతులును, భాష్యములును, జెప్పి వర్ణవ్యవస్థనుఁ గావించినట్లు వ్రాసియున్నారు. వారి వ్రాతను బట్టి చూడ మూర్తిగా రార్యసామాజికులైనట్లు తోఁచెడిని.

ఆర్యసమాజము.

ఇది క్రైస్తవమతమువలె హిందూమతమునకుఁ బ్రత్యక్షవిరోధి గాకయు బ్రహ్మసమాజమువలె వేదశాస్త్రాది సర్వప్రమాణసన్న్యాసమును గావించకయు, దివ్యజ్ఞానసమాజమువలె "జాతివర్ణకులస్త్రీపురుషాదిభేదముల" నిర్మూలించకయుఁ బ్రవర్తించుచున్నట్లు పైకెంతనటించినను లోలోపల సర్వాభిప్రాయములందును నాటిసమాజముల ననుకరించి పేరునకు మాత్రమే ప్రత్యేకముగానున్నట్లు వివేకలోకమునకు గోచరించును. కాన నీయార్యసమాజముకూడ జాతిభేదనిర్మూలనమునకుఁ గంకణముఁగట్టుకొనినట్లు చెప్పకతప్పదు. దీనికిచ్చెడిప్రత్యుత్తరములే మిగిలినసమాజములన్నిటికిఁ బ్రత్యుత్తరములైయున్నవి. కావున వారును నీగ్రంథమునకు నుత్తరవాదులగుచున్నారని గ్రహింతురుగాత! ఈయార్యసమాజమును సంస్థాపించినవారలు

శ్రీదయానంద సరస్వతీస్వాములవారు.

వీరు పాంచాల(పంజాబు)దేశముననున్న సదాచార సంపన్నమగు ఘనతఁబొందిన బ్రాహ్మణజాతియందు జన్మించినవారు. వీరిఛాయాపటమునుఁగాంచినవారికి విరాటునికొలువుకూటములోనికివచ్చిన మల్లునియాకారవర్ణనము జ్ఞప్తికివచ్చును. వీరికి సంస్కృతమున మిడిమిడిజ్ఞానముమాత్రమె యున్నట్లు వారి సత్యార్థప్రకాశ నామకగ్రంథమె చాటుచున్నది! ఈవిషయ మీవిమర్శనమువలనఁ దెలిసికొనఁగలరు. సంస్కృతపాండిత్య మెంతయుండినను వారు బహుగ్రంథద్రష్టలని వారుసంగ్రహించున వచనములు దెలుపుచున్నవి. కాని యావచనముల నేసందర్భమున శతునకుకొనవలయునో యాసంగతి వారికిఁ దెల్లియదని చెప్పుకొనవచ్చును. తమకేయర్థముగావలసియుండునో యాయర్థమునె యావచనములకు వ్రాయు

చుందురు. కొన్నియెడల విరుద్ధార్థములంగూడఁ జేయుచుందురు. మఱికొన్నియెడల మూలములో లేనియర్థమునుగూడ గూర్చుచుందురు. ఇంతియగాక తమవాదమును నిర్మూలించెడివచనముల నెత్తుకొనక వానినిఁ జల్లగ జాఱవిడిచి లోకవంచనము గావింతురు. ఇట్టిమహానుభావులుస్థాపించిన యార్యసమాజమునందు మనసోదరులు గొందఱు చేరి "విస్సన్న చెప్పినదే వేదము" ఇట్లు వారుచెప్పినవే పరమప్రమాణము లనితలంచి మూలగ్రంథములనుఁ జూడక వారిపలకఫ్తారమునె చిలుకలవలె ననుకరించి మఱికొన్నిగ్రంథముల వ్రాయుచున్నవారు. అట్టిగ్రంథకర్తలలో నాంధ్రదేశమున పైనారాయణమూర్తిగారును నార్యనారాయణమూర్తిగారును ముఖ్యులని చెప్పనొప్పును. మొదటివారు "ఈశ్వర రహస్యసారహిందూవైవాహికాదిగ్రంథములను" రెండవవారు "ప్రశ్నార్ణవాదిగ్రంథపుష్పములఁగూర్చిన" వైదికాంధ్రగ్రంథమాలికను బ్రకటించియున్నవారు. వీరికి

## ప్రమాణగ్రంథములు

ఏవియోమనము తెలిసికొనవలసియున్నది. వారు వైదికాంధ్రగ్రంథమాలనుఁ బ్రకటించుచున్నామనుటచే వారికి వేదములు పరమప్రమాణములైనట్లు తెలియవచ్చుచున్నది ఇది నిర్వివాదాంశము. "స్మృతులను బాటింపనివారు వర్ణసంకరులుగారా?" యనియు "శూద్రోబ్రాహ్మతామేత్యాది ప్రమాణముల ప్రకారము వర్తింపనివారు వర్ణబాహ్యులు కారా?" యనియు "చాతుర్వర్ణ్యంమయాసృష్టం అనుదానిని నమ్మకపోయినచో.........నాస్తికులు కారా?" యనియుఁ బ్రశ్నార్ణవనామక గ్రంథమునఁ బ్రశ్నించియుండుటచే మననారాయణమూర్తిగారికి స్మృతులును, భగవద్గీత, లోనగు పురాణేతిహాసములునుఁ బ్రమాణములైనట్లు ధృవపడుచున్నది. ఇంతియగాక వీరు భారత వాయుపురాణ హరివంశాదిగ్రంథములనుండి వచనములను గ్రహించియున్నవారు. కాన నవిఁగూడ వీరి కంగీకారములైనట్లు తెలియవచ్చుచున్నది. ఇందులకు మా

## ప్రతిజ్ఞ.

వినుఁడు. మననారాయణమూర్తిగారు స్వవాదపోషణమునకై గ్రహించిన ప్రమాణగ్రంథములుబట్టియే వారివాదమును ఖండించి యాఖండనము స్థిరమైనదని తెలుపుటకు మఱికొన్ని గ్రంథములనుండి వచనములను సంగ్రహించుచు వారివాదము శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాస జ్యోతిశ్శాస్త్ర స్మృతి యుక్తి హేత్వనుభవ చరిత్రాదులకుఁ బరమవిరుద్ధముగానున్నట్లు నిరూపించుచున్నవారము. ఈమాప్రతిజ్ఞను వీనులారవిని కొందఱు—

## ౛ సనాతన ధర్మ రక్షణ భారము. ౛

అంతయు శికింద్రాబాదునందుండు మహాబూబుకాలేజి ప్రధాన సహాయాంధ్రోపాధ్యాయులగు శివపురపుచీరభద్రపాకయాజి చివుకుల అప్పయ్యశాస్త్రి శిరస్సులమీఁద భగవంతుఁడుకాని, ప్రజలుకాని పెట్టినారా ? ఏ లేలయుపన్యాసములఁ జేయవలెను ? వ్యాసములనేల వ్రాయవలయును ? గ్రంథముల నేలరచింపవలెను ? అని శంకింపవచ్చును. కాన వారికి సమాధానమేమన ? భగవంతుఁడు సర్వులయందును స్వజాత్యాశ్రమధర్మరక్షణభారమును సిడియున్నవాఁడుజనులో కప్పు డొనఁగకపోయినను భారమునువహించి వివేకియగువాఁడు పని చేయుట విరుద్ధముకాదు. ఇది ప్రతివానికిని విధియైయున్నది. అట్లొనరించనివాఁడు దోషదూషితుఁడగునని కూడఁ జెప్పుటకు సాహసించుచున్న వారము. ఇందువలన మేమును స్వజాత్యాశ్రమధర్మరక్షణభారమును వహించి పనిచేయవలసినవారమని తేలినది, అట్లేని ప్రతిమనుజుని యుపన్యాసవ్యాసగ్రంథములను విమర్శించుటకు మీకుశక్తికలదా ? దానివలన మీకు ఫలముకలదా ? లేనిచో నీవిమర్శనములకుఁ గారణములేమి ? అని కొందఱడుగవచ్చును. వారికిఁ బ్రత్యుత్తరముగా నాకుఁగల—

## విమర్శనకారణములు.

కొన్నిటినిపుడు నివేదించుకొనుచున్నారము. ఏమనుజుఁడుతానశక్తుఁడైయుండియు శ్రద్ధచే స్వధర్మస్థాపనమున కుద్యుక్తుఁడగునో వాఁడు

# ఉపోద్ఘాతము

ఆర్యులారా!

తోటవల్లూరుగ్రామనివాసియగు రాయప్రోలు చలపతిగారి కోరికపై నీగ్రంథము నాలుగైదుగంటలకాలములో రచింపబడినట్లు ప్రథమముద్రణమందలి పీఠికవలనఁ దెలియవచ్చుచున్నయది. గ్రంథకర్తలు శ్రీతిరుపతివేంకటేశ్వరకవుల శిష్యులను సభిమానముతోనే వారి కోరికపై నీగ్రంథమును నాపత్రికయందుఁ బ్రచురించుట కియ్యకొని యిప్పటికి సంవత్సరముక్రిందనే పరిగ్రహించితిఁగాని యప్పుడు నవిమర్శముగ గ్రంథ మామూలాగ్రముం జూడనైతిని, సంవత్సరము నుండియు నిది ప్రచురించుట కవకాశము దొరకమి నూఁగకుండి ప్రకృతము ప్రచురణమునకుఁ బాపుటకై యెత్తివ్రాయఁ గొన్ని సంశయములు కానవచ్చినను కన్యావిక్రయరూప దుర్వ్యాపారుల కొకింత శాసకమైన గ్రంథమై బహుకాలమునుండి నేనుగూడ వ్రాయఁదలఁచిన విషయమగుట శీఘ్రకాలములో సాధ్యమయినంతవఱకు నొకింత మార్చివ్రాసితి. ప్రథమముం దాశుధారలోఁ బూర్తి చేయఁబడినదైనను ద్వితీయముద్రణమున నొకింత మార్పునుబొందించియే యిచ్చిరికాని గ్రంథము నేలసరిగ సంస్కరించుకొనరో మనకుఁ దెలియదు. స్వల్పాంశము లేవియెట్లున్నను విషయము చాలమంచిదై ధారయు రసమును గలకవిత్వమగుట సనాతనధర్మానుయాయులు చాల శ్రద్ధతోఁ బఠింపఁదగినగ్రంథమనుటకు మాత్రము నిస్సంశయము.

జానపాటి పట్టాభిరామశాస్త్రి
ఎడిటర్
అభినవసరస్వతి



శ్రీదక్షిణామూర్తయేనమః

# కన్యావిక్రయము

---

సీ॥ శ్రీభామినీశ రాజీవాసనప్రము
ఖామరస్తుతులచే నలరువాఁడు
జ్ఞానముద్రా సుపుస్తకవల్లకీ జప
మాలలు కేల్గుమిం గ్రాలువాఁడు
సారవిహీన సంసారవారిధినీఁదఁ
గాంచు భక్తావళిఁ గాచువాఁడు
తప్తహేమచ్ఛాయఁదనరు జటాజూట
మున నిర్ఝరాపగఁ బూనువాఁడు
చిన్న రేఱేనిఁ దల నిడుకొన్నవాఁడు
చక్కనౌ వెల్లగిబ్బను నెక్కువాఁడు
అట్టి శ్రీదక్షిణామూర్తి యమలకీర్తి
శ్రీలొసంగుత వేంకటశివుల కెపుడు॥ 1

మ॥ అకటా! యీకలికాల మెట్టిదొ కదా యన్యాయవృత్తిం బ్రజల్
ప్రకటశ్రీప్రతసస్వకీయవిమలవ్యాపారము న్బాఱఁదో
లి కృపావిక్షీణదక్షులై స్వకులజాళిన్ దుర్గతిం జేర్చి నా
రకతప్తత్రపుపాత్రమందు నతితీవ్రవ్యాధిసం బొందెడున్॥ 2

సీ॥ తమకుమారునకిచ్చెదను నాకుమారిక
వేయిరూపాయల నీయఁగలరె
తమకుమారునకిచ్చెదను నాకుమారిక
లక్షనీయఁగలరె యీక్షణమున

తనకుమారునకిచ్చెదను నాకుమారికన్
బెద్దకానులసేరు పెట్టఁగలరె
తనకుమారునకిచ్చెదను నాకుమారిక
నిండుభూమి మాకీయఁగలరె
వేయివల్కంగనేల నాబిడ్డనిపుడు
ఋణముదీర్చుటకిపుడు మీకిష్టమైనఁ
జెప్పుఁడనుచును దమతమసిగ్గువిడిచి
పలుకుచుందురు కన్నె చేఁ బ్రదుకువారు॥ 3

ఉ॥ రొక్కమొకండె ముఖ్యమని రూఢిగ నాత్మఁదలంచి కన్నియన్
జిక్కులఁబెట్టఁ దాల్మిని ద్యజించి శతాబ్దములుండినన్ సరే
రొక్కవవిత్తమిచ్చునొక వృద్ధవరున్ జగమెల్లఁజూచి వే
యొక్కమలాక్షినిచ్చెద రహా!తల లుర్వికి వంచ బంధువుల్॥ 4

ఉ॥ కన్నియనిచ్చి శుల్కమును గైకొని ప్రాణమునిచ్చుకంటె నా
పన్నగదంష్ట్రనిర్గళితభంజనశీలవిషప్రవాహముల్
గ్రన్ననఁద్రావి నిశ్చలతఁ గాయముఁబాయుటపోయి కాని యీ
కన్నెలవిక్రయించుటలకన్న నఘంబు మఱొండుగల్గునే॥ 5

శా॥ కన్యాప్రాణలతాలవిత్రులు మహాకాఠిన్యచిత్తుల్ సుతా
దైన్యోద్దీపనకారణుల్ విగతసన్మానుల్ దరిద్రుల్ కృపా
శూన్యుల్ నిర్మలపుణ్యహీనులు ధనాస్తోకప్రమోదాఢ్యులై
కన్యావిక్రియవక్రజీవనులు లోకంబందు వర్తించెడిన్॥ 6

ఉ॥ కూలియొ నాలియో సలిపికొంచును బూదుకొనంగరాదె యా
శాంతికావృతోదర విశాలగుహాళిని, లేక స్వేచ్ఛమై
పాలికవృత్తిఁగైకొనఁగ న్యాయముకాదె, కటా సుతాక్రయం
బెల్లగ్రహింపఁగావలయు నిట్టిపనుల్ సుఖదాయకంబులే॥ 7

ఉ॥ కన్నియనమ్మి యాధనము గైకొనినప్పటికూడఁ దృప్తికిన్
దెన్నునుగాంచలేని జడధీయుతు లాత్రతనూజలెంతయున్
బన్నములొందఁగా ముసలివాండ్రకునిచ్చుటకన్న మున్నగన్

సీ॥ గొప్పవాఁడనుచుఁ దనుఁగోవిదు లెగిన నీచవృత్తిని వారిఁ జూచువాఁడు
రాజనిదర్శింపఁ బ్రజలురా బైటికి భృత్యులచేత నంపించువాఁడు
దాతయంచును బీదలేతేరఁ గాఁపైనఁ గేలనుంచక పైకి గెంటువాఁడు
న్యాయకర్తయటంచు న్యాయమ్ముఁగోరంగఁ గట్టిపుల్లింగముల్ పెట్టువాఁడు
క్షితియుండుగదాయుంచు జనము వేడ
నాజ్ఞకోశాతకినిబోలె నాస్వాదయుంబు
పొర్థకముగాకయుండు నవృశంసకుండు
గృష్టుఁడను వంచకుండు నాస్తికధనుండు॥ 16

తే॥ ఎంతశక్తియునుండిన నేమిఫలము
ఎంతయైశ్వర్యముండిన నేమిఫలము
పరుల కుపకృతిగాదేని, పాముపడగ
మీఁదమణియుండినంత నేమిఫలమొప్పు॥ 17

తే॥ మానవాధిపుఁ డధికదుర్మార్గచరుఁడు
నుతికిమీఱిన గుణవతి యతని పడఁతి
ముండ్లతోఁగూడిన గులాబిపువ్వుపోల్కి-
నలరెసిరు పురదాంపత్య మవనిలోన॥ 18

సీ॥ అతివకన్నులతీరు శతపత్రములగేరుఁ
జెలిమోము మించువెన్నెలహసించు
అనబోఁడికెమ్మోవి యమృతంపుదీవి యూఁ
రమణిదంతాళి కుందములపాళి
కలికిఫాలంబు ఱేకలువరాతిల్యంబు
కంబుసామ్యంబు శ్రీకంధరంబు
కమలాక్షి పాలిండ్లు గబ్బిబంగరుగిండ్లు
వనితకు మధ్యగన్గొనఁగ మిథ్య
హేమరంభాప్రభాకార మింతియూరు
జబిపొక్కిలియెన్న సోయగపుఁబొన్న

భూధవాజ్ఞాపితయగుచుఁ బుణ్యకాంత
యకట! యత్యంతకష్టంబులైనయట్టి
పనులఁ జేయుచునుండెఁ దాపసులగుంపు
ప్రాంతమునఁ జింతనొంద నవ్వనములోన॥

తే॥ ధాన్యమొందుటకయి తదాధారమైన
పాత్రమును సింహునటుల నాపరమపురుషు
తోడఁ బరితాపమొందు నాతోయజాక్షి
ధరఁ బతివ్రతయన నిట్టి తరుణిగాదె॥

చ॥ విలువగలట్టిచీరలను వేలకువేలు ఖరీదుగల్గు భూ
షలును బరీమళంబు నెదఁజల్లెడు చందనపుష్పమాలికా
వలులనొసంగుసాధులను బజ్జగుఁ జేరిచి యాయ లేనిచో
నలిగెడుకాంత లెన్నటికినైనఁ బతివ్రతలౌదురే ధరన్॥

తే॥ ఇద్దిగృహమున నున్నది యిద్దిలేద
టంచుఁ బలుక దెన్నండు నాయమలచరిత
కలియొ గంజియొ త్రాగుచుఁ గలుగువస్తు
వులనె కాలమ్ముగడపుదు రలఘుమతులు॥

ఉ॥ ఈవిధినుండ నయ్యడవి నే బహుకాలముఁ గష్టమొందుచున్
ఆవనజాతలోచన కుచానతగాత్రి మహాగుణాఢ్య సా
ధ్వీవనితాకులోత్తమ సువీరువిలాసిని నొందె గర్భమున్
భావజు చేఁగటారియన బాల మిటారిని గాంచె వేడుకన్॥

క॥ ఆపుట్టినకన్యక శోభాపూర్ణతఁదనర మిగుల భాసిలె నిత్యం
బేపారు శుక్లపక్షనిశాపతికలయో యటంచు జను లెంచంగన్॥

సీ॥ నీరజంబులనైన నిరసించు చేతితోఁ
బాలాశదండంబు పర్యగుచుండ
కమలశత్రునితోడఁ గలహించుమోమున
బూదిరేఖలుమూడు పొలుపుగాంచ

అలకవాటమ్మైన గెలుమువక్షంబున
జందెంపుఁబోగులు చంచలింప
భవతిభిక్షాం దేహి వాక్యంబు మొగమున
మించు తేజంబుఁ బొందించుచుండ॥
చేతియందునఁ జిఱుచెంబు చెలఁగుచుండ
దీప్తమగు బ్రహ్మణ్యమైన తేజమునఁగ
వేదపారాయణముగొప్ప వెలుఁగుఁజూప
వటుఁడుచనుదెంచె నారాజవాసమునకు॥ 30

వచ్చి నుపినుగిమునకు వాకిలియందున నాసీనుండు నా
మచ్ఛరిరాజపుత్రికను మంజులగాత్రినిఁ జూచి డెందమం
దెచ్చుగమోహమంది యట చేసియుండఁగోఁజక వాంటితోటికిన్
అచ్చపలాక్షిఁజూచియతిఁ డాత్మను వర్ణనసేయు నిట్టులన్ 31

పల్లవాధరి మోవిపానకమానక
గౌరవంబునుబొందఁగలవె రదము
లంభోజలోచన రంభోరులొందక
గౌరవంబునుబొందఁగలవె శిఖము
లన్నులమిన్న కుచాద్రుల నెక్కక
గౌరవంబులుబొందఁగలవె కరము
లంబుజగంధి గండంబుచుంబింపక
గౌరవంబునుబొందఁగలవె పెదవు
లతివవాక్కులువినక యీ శ్రుతులు పొందఁ
గలవె గౌరవమకట! యీనలువ చెలువ
చెలువురూపునుసృజియించె, చిలువతేని
కైనఁ దరమానె పొగడఁగా మానితముగ॥ 32

అనుచులతాంగిరూపమును నాత్మను వర్ణనసేయుచుండ నా
జనపతివచ్చి యావటునిచక్కదనంబును జూచి "యోయి! యీ

వనమున కేమి హేతువున వచ్చితివి? యెవ్వఁడ వీవు?" నా ననే
మనమున మోహ మొంద నను మానము లేక నడుగు రాజుతోన్ ॥

చం॥ "నరపతివర్య! నేను మునినందనుఁడన్, నిగమాగమంబులన్
గరముఁ బఠించుచుండుదుఁ, బటుండఁ, గోపురమిప్పనినాను, భిక్షకై
యరుగుచు నీసుతం గని, యప్పటినుండి మదీయచిత్త మీ
సరసిజనేత్రపైఁ బడియె, చయ్యన నీ పుత్రికనిమ్ము నెమ్మనిన్" ॥ 34

చం॥ అనగ సువీరుఁ డిట్లనియె, "నయ్యా! దరిద్రుఁడ నేను, విత్తమున్
గొనియిటులిచ్చెదు తజని గూఁతుని భార్యగఁ గ" న్మటంచనన్
మునివరపుత్రుఁ డిట్టులనె మోహము పెంపునుబొంద, "భూధవా!
ధనమున కేమి యిచ్చెదను దామరసాక్షిని బెండ్లిసేయుమా" ॥ 35

చం॥ అనుచు సువీరునాజ్ఞ గొని యావటుఁడేగెను నర్మదాతటం
బునఁ దపమాచరించి సుతపోమహిమమ్మున జాలవిత్తముం
గొనివెదనంచు నమ్మకముగూర్చి, యనంతర మా నృపాలదు
ష్టునిసతి యిక్కథన్ విని కడున్ నయమున్ భయముం బెనంగొనన్ ॥

చం॥ పలికెను రాజుతోడఁ, "దమవంటిమహాత్ములకేను జెప్పఁగాఁ
గలనె, సుతాక్రయంబు నరకంబిడునంచు నడంపుచుండఁ బె
ద్దలవలవింటఁ గావున యథావిధినుండుట చేత నల్లవా
రలకు లభించు శ్రేయము, తిరంబగు కీర్తియుఁ గూడఁ గల్గెడున్ 37

ఉ॥ ఎక్కువ సౌఖ్యముం గలుగు నిట్టులఁ జేయుట యంచు రాజు తెం
చెక్కడ సౌఖ్యవారిధికి, నీవనసీమను గందమూలముల్
బొక్కుచు నిట్లు కాలమును బుచ్చఁగ సిద్ధి సుఖంబుగాదె, పెం
పెక్కెడుగాదె త్రుంచినను నెప్పుడు వాంఛలు బ్రహ్మనందనా ॥

మ॥ తమపైనుండిన ధన్యచేత నిదమిత్థంబంచు వాక్రుచ్చినా
ను మహాత్మా! మతియొక్కరీతి మానమందుం(గాంచఁ)బోక యయ్యో
నిక్కము మీపాదములాన" యంచు బలుకంగం గంచుదుర్ది కర్త "
పమనస్కుండయి భార్యతోడ నిటులం బల్కుం గతోరార్భటిన్ 39

చం॥ "తగుదునటంచు నాకిపుడు ధర్మము చెప్పఁగ వచ్చినావె, తో
నగరె విచిత్రసుందరము వినంగను లోకులు, చాలుచాలు నో
ముగుదరొ! ధర్మశాస్త్రముఁ బ్రమాణము చేసి నటించఁ గుక్క పి
ల్లగలి గెసంబు నెట్టులఁ బ్రలాపములాడెద వేల చెప్పుమా॥ 40

చం॥ అలఘుసుఖంబు గల్గునను యోగ్యంబున వర్ధనుదెత్తి మంద భా
గ్యులు గలరే, శ్రుతుల్ స్మృతులు నూర్జితకీర్తి ననూర్జితక్రియా
కలనము సేయు నప్పుడె వికస్వరచిత్తులు పాటిసేసెడిన్
సూలువలెఁ ధర్మశాస్త్రములంచు దనేచే పదరస్సి కార్యముల్॥ 41

ఉ॥ శంఖధరుండు గాని గిరిజాపతి గాని విధాత గాని
శ్శృంఖలితత్వమేర్పడఁగ స్వీయసమర్థతఁ జూచిరో శ్రుతి
ప్రేంఖణమాచరించెదరు, వీరలు పూజ్యులొకో, శరీర మా
ద్యం ఖలు ధర్మసాధనమటంచును మాత్రము పల్కవే స్మృతుల్ 42

తే॥ ఏదియొటులైనఁగాని నే నీకు సారి
నమ్మదానటంచుఁ బల్కెద నంతలోన
పట్టుఁగుచను దెంచి యా రాజవాసమునకు
ద్రవ్యమంతయు నిచ్చె సంతసము మీర 43

చం॥ ముదమును బొందె డెందమునఁ బుత్రికఁ బాలుని బిడ్డకిచ్చి త
త్సదనమునన్ వివాహవిధి నల్పి కుమారితనంపి భర్తతోఁ
గదలిక లేని సౌఖ్యమును గాంచుచునుండఁగ నంతలోన భూ
మిదయితు భార్య వెండియును మేటికుమారికఁ గాంచె వేడుకన్ 44

ఉ॥ కూఁతును జూచి నాకు నిఁక క్షుద్రతఁ దీర్పను బుట్టెనీమె, సం
భూతపురాణపుణ్యమున భూరిధనమ్ము లభించు నాకు, నీ
నాతి నినమ్మెదన్ బహుధనమ్మునొసంగెడి వారికంచు నా
భూతలనాథుఁ డెంతయును బూర్ణముదంబును బొందె నత్తఱిన్ 45

శా॥ "బ్రహ్మైవాస్మి శివోఽహ" మంచుఁ గరముల్ భాషింపుచుం గేవల
బ్రహ్మజ్ఞానపరాయణుండు గతపాపస్తోముఁ డుద్దాముఁడున్

చం॥ అనయతినాథుఁడిట్లనియె, "నక్కట మూఢునిరీతినీవునీ
పనినొనరింపఁ బాడియె, శుభంబె సుతాక్రియమత్త్రిచేతజీ
వనమును జేయువార లసివత్రముఁ జేరుదు రంచెఱుంగవే
మొనయక యిట్లు చేయుటని యేరికి సౌఖ్యము గల్గు భూవరా!॥ 53

కం॥ కన్నియ నమ్మిధనమ్మునఁ
గ్రిన్నన దేవర్షి పితల కార్యమ్ముల సం
పన్నత నెవ్వఁడు చేయును
య న్నరు శపియింత్రు పితరు లనపత్యునిగాఁ 54

శా॥ ప్రాయశ్చిత్తము చెప్పఁజుండురిల నేపాపాత్ముకైనన్ బుధుల్
ఏయే హేతువునో సుతాక్రియముపై నిష్కృతింపరో భూధవా!
మాయాదర్వ్యసుఖం బశాశ్వతముసుమ్మా! స్థైర్యమై దేవతా
గేయంబౌగతిఁబొందఁ శక్తుఁడవు సూక్తిన్ విన్నచో వేగమే॥ 55

ఉ॥ ఇమ్ముగ విప్రకన్యలకు నిచ్చి వివాహము చేయుగాగ యథో
క్తమ్ముగ నీదు రెండవసుతామణి నీపితృదేవతల్ ప్రమో
దమ్మును బొంది యెందమున ద్వాత్మకులమంత యువృద్ధి సేసి ని
త్యమ్ము భృశమ్ము శపిస్తుదురు,, రంచును బల్కఁగ రాజునిట్లనెన్॥ 56

సీ॥ కల్లనెఱుంగఁ డుకటె హరిశ్చంద్రుండు
చండాలునకుఁగూలి సలుపలేదె
న్యాయవంతుఁడెగద నలమహీనాథుండు
కాంతా వియోగమ్ము గాంచలేదె
నిత్యదానక్రియా నిరతుఁడుకద నృగుం
డూసరవెల్లియై పొందలేదె
ధర్మవంతుఁడెకదా ధర్మరాజను వాఁడు
వనవాసము చేయఁ జనగలేదె
ద్రవ్యసంపాదనము సేయఁదలఁచి ద్విజులు
శ్రుతులు స్మృతులంచుఁ బేర్చెట్టుచుందురరయ

వక్కఆకువచ్చునే ధర్మమొక్కపనికి
నైన యోజింపు మాత్మను యతివరేణ్యా!॥ 57

ఉ॥ దానము ధర్మముం దపము దాంతియుశాంతియును క్రియా క్రియల్
మానము జ్ఞానమున్ నిరవమానము మానముచే బ్రయోజనం
బౌను ధరన్ నిజంబు సనయంబు మనంబు ముదంబుడంబుగా
నూనుచునుండ భోగియగును తమమానసుండె సుధన్యుడౌ "॥ 58

కం॥ అనవిని మునింటిట్లనె నా
జనపతితో వసుమతీశ! చయ్యనవినినా
మనమున ముద మొనఁగూర్చెను
వనిజాతుండునీకు నిఖిలభాగ్యము లిచ్చున్ ॥ 59

సీ॥ తనకళేబరము యాచన మొనరించు డే
గకు నిచ్చి శిబి కీర్తిగాంచ లేదె
ఘనుఁడగు దుర్వాసమునిపాదమాతికోర్చి
యంబరీషుఁడు సుఖమంద లేదె
కూలిసేయుచు గుణశాలి పురూరవుం
డఖిలభాగ్యంబుల నంద లేదె
దావాగ్ని చేత సంతాపమునంది యూ
(యటవియెల్లను ఫలించుటయుఁగనమె)
జ్ఞానులగువారు ముందు కష్టములకోర్చి
పూనుదురు వెనక గొప్పసౌఖ్యానుభవము
ధర్మవిజయతియంచుఁ దలఁచుమయ్య
కన్యకాదానమునఁగోర్కె గాంచుమయ్య "॥ 60

కం॥ నావినిమునితోనిట్లనె। నావసుధాధిపుఁడు " మునివరా! వినుమానా
భావముధర్మము నొప్పదు। జీవించెదఁగన్యనమ్మి శీఘ్రముచనుమా"॥ 61

ఉ॥ అంతటఁజింతనొంది మనమందున నాముని నర్మదానదీ
ప్రాంతము వీడియేగెను స్వవాసముకై, కుటిలుండు రాజు తా

సీ॥ సలసలగాఁగుసీసమ్మె దప్పికేఁగాఁగ
పల పలలములె జేమనముగాఁగ
నడునడుమని గడగడ వడఁకించువా
క్యమ్ములే కర్ణపేయములుగాఁగ
భగభగజ్వాలఁ బ్రజ్వల దయస్స్తంభ సం
శ్లేషమే ప్రియకౌఁగిలింతగాఁగ
రక్తప్రవాను రక్తనానాపక్షి
సముదయమే సహచరులుగాఁగ
వినినమాత్రనె మన మతిభీతినందఁ
జేయుకష్టంబులన్నియు స్వీకరించి
యానువీరుఁడు యముపాలికరిగెనహహ!
కర్మఫలమును దప్పింగఁగా వశంబె॥ 67

ఉ॥ ఆయమధర్మరాజు విదితాఖిలభూపచరిత్రుఁడై దుహీం
నాయకుతోడఁ బల్కె నరుణప్రభఁజిమ్ముచునుండ నేత్రముల్
"ఓయి! మృదూక్తిచేత ముని యొప్పఁగఁజెప్ప నిరాకరించితే
పాయక నీవు నప్పుడసిపత్రము పాపలవిత్రి మొందుమా"॥ 68

చం॥ యమపతియాజ్ఞనొందిభటులాకుటిలాత్మునిబట్టికొట్టి వే
గమ యసిపత్రనామనరకంబునఁ ద్రోసిరి, తత్ప్రవేశవం
శమునజనించిరొక్కరుఁడు జన్మములెన్నియొ పన్నుచుండి లో
కము శ్రుతికీర్తినాఁ బిలువఁగా విలసిల్లుచునాతఁ డత్తఱిన్॥ 69

శా॥ సోపానంబులుగాఁగజన్మములు తత్స్వర్గంబునం జేర్చె, సం
తాపంబొంద సుచిర పాపమున దూతవ్రాతముల్ వేగ ని
ష్ఠాపుండై శ్రుతికీర్తిఁ దెండనుచు మాఁదాఁ బంపె యముండంత, సు
దీప్తక్రోధమునొందిబంట్లు శ్రుతికీర్తింబట్టి రాహాయనన్॥ 70

కం॥ శ్రుతికీర్తి మగమునందున
నతులితధైర్యమ్మునూని యమునకునని యోగా

"చతురతనిట్టుల శమనా!
మతిమంతులకిదియతగుట మహిలోఁగలదే॥ 71

సీ॥ అగ్నిసాక్షిగవివాహంబు సేసికొనుసతి
నేకాని పరసతి నేనెఱుంగ
దేహియం చర్థిసమూహంబు వేడంగ
(నెంతేనియుం గపంపించి) యెఱుంగ
పదిమందితోడ సాపాటు సేసితిఁగాని
చెలఁగి (యొక్కండనై) చేసియెఱుంగ
జన్నంబులన్ని సంపన్నతఁ జేసితిఁ
గాని (లోపంబించుకేని) యెఱుంగ
కలను (నేని) యబద్ధంబుపలికియెఱుంగ
మంచివారలనెవ్వ దూషించియెఱుంగ
నిట్టిగతినొందఁగారణమేమొ చెపుమ
విహితజంతుసమూహా! యోమహిషవాహ!"॥ 72

మ॥ శ్రుతకీర్తిరితవాగ్విలాసములు తచ్ఛ్రోత్రంబులన్ నాటఁద
త్పితృనాథుండిటుపల్కె, "నోయి! శ్రుతకీర్తీ! సద్గుణా! నీదుసం
తతిజన్మించి సువీరనాముఁడొకఁ డాత్మప్రాప్తగర్వంబునన్
సుతనమ్మెన్ మునినాథపుత్రకునకీచోద్యంబునున్ వింటివే॥ 73

చ॥ కనుకనెనీవునిప్డు నరకంబునుబొందితి" వంచుఁబల్క నా
జనపతివంశజుం డిటువిచారముచేఁ బలుకంగఁజొచ్చె, "నో
యనఘుఁడ! నాకెటుల్ గురితమంతయు నంతమునొందుఁజెప్పు" మం
చనవినియాయముండు తనయాత్మ దయాళుతనొంద నిట్లనెన్॥ 74

చ॥ "విను మదిఁ జింతనొందక సువీరుని రెండవపుత్రికన్ లస
ద్వినయవిధేయతాదిగుణవి శ్రుతకీర్తికినిచ్చి పెండ్లిచే
సిన నిదితప్పు" నంచనఁగఁ "జిత్త" మటంచును నర్మదాతటం
బునకుఁజనెన్, మహాద్వచనమున్ జవదాటుదురే సుధీవరుల్॥ 75

ఉ॥ చేరి సువీరుభార్యఁగని చిత్రచరిత్రమునంత చెప్పి యా
తీరము వీడి యొక్కపరదేశముఁ జేరి యటుల్ వసించి యొ
ప్పారుగొనమ్ములందనరు పాలుని నొక్కనిఁజూచి "సుందరా
కారుఁడు సద్గుణంబులునుగల్గువరుం డిటనుండెనే బుధా!"॥ 76

ఆ॥ అనుచుఁబల్కవిప్రుఁ డతనికినిట్లను
" (గ్రామమేది? నీదునామమేది?)
యెవరవీవు " నా క్షితీశుండుఁబల్కను
నతనితోడఁ జరితమంత వేగ॥ 77

క॥ నావిని భూసురుఁడప్పుడు। భూవిభునకుఁ జెప్పఁదొడఁగె నామోదముతో "సం
భావితుఁడిప్పురనాథుం। డీవసుధాధిపుని నెన్న నెవరితరంబా॥ 78

సీ॥ అళులగుంపుల పెంపు నణఁగింపుజగినింపు
చొక్కంపుఁగురులచే నిక్కువాఁడు
చిల్కకల్కనుమాయిఁ జీకాకుపడఁ జేయు
మిసమిసలాడు నెమ్మోమువాఁడు
ఇందునియందంబు చిందఱవందఱ
పొందించుమోము పసందువాఁడు
మీలజాలంబును మేలమాడువిశాల
మైయొప్పు నేత్రద్వయంబువాఁడు
న్యాయమార్గంబుదప్పక నడచువాఁడు
పరుల కుపకారమున గట్టిపట్టువాఁడు
ఖలులశిక్షఁ గంకణమునుగట్టువాఁడు
దేవదత్తుఁడునాఁగ వర్తించువాఁడు॥ 79

ఉ॥ చోరుల నక్కడక్కడకుఁ జక్కనిచుక్కను దెండటంచు నా
భూరమణుండుపంపఁగను బోయినవారలుగాంచ లేక నేఁ
డూరికిఁ జేరి రంచనఁగ నొప్పుగుకల్కఘోటోనుజూపి యా
పాలుని వెంటఁబెట్టికొని పార్థివుఁడేగెను రాజుచెంతకున్ ॥ 80

ఉ॥ పోయి పురోహితుండు పువుబోణిపటంబును జూచి "హరి సం
స్త్యాఘము నర్మదాతటమునందున నున్నది" యంచు మేదినీ
నాయకుతోడఁ దత్కథ మనంబు ముదంబును బొందఁ జెప్ప నా
నాయక(మెల్లజూచి పడి చోద్యము చేసెను దానివర్ణనల్॥, 81

మ॥ మొగమా యాతోఁగ జేనినవ్వ, బొమలా పూవిల్తుసింగాణులా
సొగసౌ నాసికమా తుపాకి, వనితా శ్రోత్రంబులా, శ్రీకృతుల్
నగవా బల్మగ జాలమించుఁ, గనులా నాళీకములో వ్రేలు, సొం
పగుగుబ్బల్లలపీని చెప్ప దహహా! యా శ్లేషముం జే(తునో)॥ 82

క॥ అని కొంతతడవు మనమం
దున (వర్ణించుచుఁ) బురోహితునితో లగ్నం
బును (యోజించియు) శ్రుతకీ
ర్తినిబంపెను దత్ప్రియత్న రీతిని జేయుగ॥ 83

ఉ॥ పిమ్మట దేవదత్తుఁడును బెండ్లికి వేగమె సేనతోడ నె
క్కుమ్మడి గాబయల్వెడలి కొండొక దూరము పోయి మార్గమ
ధ్యమ్మునఁ గంజపుంజము ముదంబు నొనర్చు మహాతటాకతీ
రమ్మును జేరి యొక్క శిబిరమ్మున వాసము సేసె వాసిగ॥ 84

సీ॥ చంచలించెడు తమ్మిపంచల రాయంచ
లించగు మించుల సంచరించ
పంకజంబులఁ దేంట్లు ఝుంకారములు సల్పి
మకరందమూని భ్రమణము సేయ
నన్యోన్యమును బరిహాస చూడుచుఁ బోంట్లు
కలకలధ్వనుల గేళులనొనర్ప
మత్తగజౌఘంబు తత్తరంబున నీరు
గ్రోలి వప్రక్రీడ లీలఁ జేయ
పుష్పాదులఁ జిమ్ము తెమ్మెర లొప్పగు నల
సార భాగార డిండీర నీర పూర

సారకాసారతీరవిహారమపుడు
భూమిపాలున కత్యంతమదమొనర్చె॥ 85

ఉ॥ జారులు(తీరి)గూడులకుఁ బక్షిసమూహము(లెల్లఁ)జేరె, నా
సారసవల్లభాక్షములచాయలు జాఱె, మరీచికావరో
ధారలపెంపుతీఱె, భువిఁ దమ్ములశోభలు నాఱె, సిరజా
ధారుఁడు తార్కెలోలకుముదమ్ముల కాంతులు మీఱెన త్తఱిన్॥ 86

సీ॥ పశ్చిమదిక్కాంత పతిచెంత కేగను
ధరియించు కెంబట్టుదట్టియనఁగ
అంధకారమ్మను గంధగజమున క
లంకృతి సేయు పల్యాణమనఁగ
అస్తాద్రియను రాజు మస్తకంబునఁ దాల్చు
దాసాని పువ్వులదండయనఁగ
కైరవప్రియ సమాగమనలాలన నిశా
కల్పితహల్లక తల్పమనఁగ
కృత్తమత్తగజాసురసత్తుఁడగుచు
తాండవోత్సవమొనరించు చండికేశు
రక్తచర్మప్రదీప్తిసంపత్తియనఁగ
నాకమందున సంజకెంజాయ యలరె॥ 87

తే॥ సమయమృగరిపు వంధకారమదకుంభి
కుంభతలమున బంజి చేఁగొట్టవేగ
జలజలను రాలుమౌక్తికంబులన నవుడు
గగనవీథిని దారకాగణములమరె 88

సీ॥ భువననాటకమందుఁ బురుషోత్తముని చేత
లలిగ వెల్గించు గ్యాస్లైటనంగ
ప్రాగ్దిశారమణి తోరంపుఁ బేరుమ్మునఁ
బూనిన వజ్రంపుఁబోగనంగ

అమరు లౌషధమునకై వియద్భిత్తికఁ
దద్దయు నిడు వెన్న ముద్దయనఁగ
శంకరారాధనసల్పుటకై భక్తిఁ
బాకారికొను పుండరీక మనఁగ
పుష్కరవితానమునఁ బొలుపుగాంచు
పాదరసపాత్రినాఁగ విభాసమాన
మానమహాశేష ఘోరాంధ ధ్వాంతధామ
సోముఁడుదయించె నావ్యోమసీమ నపుడు॥ 89

ఉ॥ అత్తతిదేవదత్తుఁ డనసూయకుఁడై మలయానిలంబుచే
బిత్తరిజింకదా ల్పులరువిల్తుల వేదనచేఁ గృశించి తా
ను త్తలపాటుచెందిమది నోపక వారినిదూరి యానిశిన్
ద త్తటమందునే గడపదర్శితమయ్యె నువేరువంతటన్॥ 90

ఉ॥ చక్కలడాలుమానె, బరిశుద్ధతమై ద్విజరాజి స్నానముల్
చక్కగఁజేసి సంధ్యలనుసల్పుచునుండిరి, పక్కులెల్ల సొం
పెక్కఁ గులాయముల్ విడిచి యింపుగ శాఖల గానకేళులన్
బెక్కురు మెచ్చునట్లుగను నీటుగఁ జేయుచునుండె వింతగన్॥ 91

సీ॥ - ఘనపదవీశ్యామకైరవమందున
రంజించు కింజల్కపుంజమనఁగ
ప్రాగ్దిశారమణికి స్వర్ణకారుఁడొసంగు
కనకమయంపు నాగరమనంగ
శుంభదైరావణకుంభప్రదేశస
ల్లలిత జాంబూలదకలశమనఁగ
లోలకాలవ్యాళఫాలభాగంబునఁ
దళతళమెఱయు రత్నంబనంగ
ఖండితసరోజినీమిహికాదృగంబు
వ్రులను దుడుచుటకై కరమ్ములనుబంపె

నోయనుచు భువిసంశయ మొందుచుండ
భానుఁడుదయించెఁ బూర్వదిగ్భాగమందు॥ 92

క॥ అంతట భూకాంతుఁడు తన। స్వాంతము నైర్మల్య మొంద స్నానాదుల న
త్యంతాసక్తిని జేసి యు। ష్ణాంశుని నిట్లు వేడె నంజలిధరుఁడై॥ 93

చ॥ ఉదయమునందు బ్రహ్మవని యుగ్రుఁడవంచు పరాహ్ణమందు దై
త్యదమనుఁడవంచు సాయమున దాసులు గొల్వఁగ బ్రేమతోఁ సుఖ
ప్రదుఁడవు నీవె సూర్య! యసహాయపరాక్రమ! కర్మసాక్షి! స
మ్మదమున నర్ఘ్య మిందు మనమూన! ప్రభాకర! సద్గుణాకరా!॥ 94

సీ॥ దానోదకాసారలీన భృంగధ్వని
ద్విరదసంఘంబు ఘీంకరణమూన
రింఖాసముద్ధూత రేణువృతాంబర
విలసత్తురంగ హేషలు చెలంగ
నిటునటు నాభీల హేలచ్ఛటాచ్ఛాయ
భటసమూహంబు విభ్రాంతినుండ
మార్గనంసక్తసామంతపృథ్వీపాలు
లెలమిని గట్నంబులిచ్చుచుండ
సరససంగీతశాస్త్రవిశారదులును
వేద వేదాంతవిద్యాప్రవీణమతులు
వేశ్యకాంతలు దాసీలు వెంటనంట
దేవదత్తుఁడు వీఁడెఁ దత్తీరమంత॥ 95

సీ॥ పాలకుండలఁ బెట్టి బట్టలఁ దలఁజుట్టి
వడిగఁ దెప్పలనీఁదు వారితోడ
పూని సరంగు చుక్కాని వేయ గడల
వేవేగఁ ద్రోయు నావికులతోడ
పసువుల నీటిలోఁ బడఁగొట్టి తోఁక చేఁ
బట్టి యీఁతలుగొట్టు వారితోడ
నంజపి కారుకై సఖులతో డింగిల

పైనెక్కి పోయెడు వారితోడ
రంగదుత్తుంగభంగవిహంగసంఘ
మిథునకేళులు వింతగా మెలఁగుచుండ
ద్విజవరుల స్నానసంధ్యాదివిధులెసంగ
నర్మదానదిఁ జేరె నా నరవరుండు॥ 96

శా॥ ఆవార్తన్ శ్రుతకీర్తి సేవకులచే నావేదితుండై వెసన్
ఆవేశించి నృపాలు చెంగటకు నాహ్వానంబునుం జేసి స్వీ
యావాసంబునుఁ జేర్చి వేవరుస కళ్యాణమ్మునుం జేసి యా
త్మావిర్భూతముదంబుతోఁ సలిపెఁ గన్యాదానమున్ భక్తిగన్॥ 97

మ॥ కర మాశీర్వచనంబు భూసురులు వేదోక్తిన్ సల్పఁ బూఁబోండ్లు ప
ల్లైరముం జేతనుబట్టి పాటలను సాళింబాడ వాలుబ్బుపా
తరకత్రైల్ నటనంబొనర్పఁగను వాద్యంబుల్ కమున్ మ్రోయ సా
దరవృత్తిం దలబ్రాలు వోసికొనిరా ధాత్రీశుఁడుం గన్యయున్ 98

తే॥ పంచదినములు తమకిచ్చు వచ్చినటుల
నిష్టభోజ్యాన్నములచేతఁ దృప్తినంది
బహుమతులనొంది సేనతోఁ బయనమయ్యె
దేవదత్తుఁడు పట్టపుదేవిఁ గూడి॥ 99

చం॥ పదపడి సూర్యనందనునిపాలికి నా శ్రుతకీర్తి చేరి త
త్పదచరుఁడౌ సువీరునికి బాగుగ నా కథఁ జెప్పి దేవతా
పదవికి వెంటఁ బెట్టుకొని వైశ్యుఁగాఁ జని తద్దినంబునన్
గదలిక లేని సౌఖ్యములఁ గాంచిరి దేవతలున్ స్తుతింపఁగన్॥ 100

ఉ॥ ఆరయఁ గన్యకాక్రయము హైందవులందఱుఁ గ్లేశమందఁగన్
గారణ, మట్టి కార్యమునఁ గల్గు దోసంగులఁ జెప్ప నీకృతిన్
గౌరవముంచి యందఱును గాంచి యథావిధి నుండుగాక, స
త్కారుణికస్వభావమునఁ దప్పులఁ బ్రోతురుగాక కోవిదుల్॥ 101

ఇట్లు జంధ్యాల వెంకటశివకవులు.

[illegible]

1. శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు

రాజా కోటగిరి వెంకటకృష్ణారావు బహద్దరు సమూరజమీందారు గారు [illegible]

ఈ నెలసొమ్ము చెల్లించిన చందాదారులు

వాఝిలాల సీతారామశాస్త్రిగారు-జిల్లాకోర్టు ప్లీడరు గుంటూరు.

నీలంరాజు జానకిరామయ్యగారు నర్సారావుపేట.

భీమరాజు లక్ష్మీనారాయణరావుగారు ప్లీడరు నంగవ్రోలు.

కంచిరాజు లక్ష్మీనరసింహముగారు హైకోర్టుప్లీడరు కుమారస్వా కడప.

పెద్దిభట్ల పెదనాగేశ్వరరావుగారు తహశీల్దారు రేపల్లె.

ప్రభల వెంకటసుబ్బయ్యగారు స్పెషల్ రివిన్యూ ఇన్స్పెక్టరు రేపల్లె

చివుకుల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు పల్లకోన.

తాడేపల్లి పూర్ణయ్యగారు హెడ్మాస్టరు నర్సారావుపేట.

చతుర్వేదుల నరసింహముగారు విప్పర్లపల్లె.

కూచిభట్ల వెంకటసుబ్బయ్యగారు రివిన్యూ ఇన్స్పెక్టరు ఉల్లిపాలెం.

వేమూరు వెంకటసుబ్బయ్యగారు వేమూరు.

చక్రవర్తుల లక్ష్మణాచార్యులుగారు అంతర్వేదిపాలెం.

తురిమెళ్ల హనుమంతరావుగారు కలెక్టరాఫీసు గుంటూరు. 1 1

14. వెల్లంకి సీతారామబ్రహ్మశాస్త్రిగారు-గుంటూరు.

Reg. No. 7



# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు.


సంపుటము 10 | 1918 సం॥ సెప్టెంబరు | సంచిక 9.


## విషయములు.




చందానిర్ణయము సంవత్సరమునకు.

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 3 0 0

చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Gunt

and published at Janapadu, by the Edi

Janapati Pattabhira

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురుపుష్పగిరిస్వాములవారు

## పోషకులు.

1 రాజా వాసిరెడ్డిచంద్రమౌళీశ్వరప్రసాదు బహదరుమన్నెసుల్తాన్ గారు, ము

2 రాజానారయప్పారావు సింహాద్రప్పారావు బహదరు జమీందార్లు, నూజ

3 రామసింగుగారు నెల్లుట్ల పాపురపు సంస్థానముమేనేజరు, నెల్లుట్ల.

4 జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు కారంచేడు

5 జిల్లాడి లక్ష్మణరావుగారు కరణం జంగపల్లి.

6 తాడేపల్లి లక్ష్మీనరసింహారావుగారు ముక్తాదారు చోళ్లేరు.

8 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టు వకీలు, గుంటూరు.

9 ఆలా నారాయణరెడ్డి దేశముఖుగారు, వన్నాజిపేట.

## సహాయులు.

1 తంగెడ నరసింహారావుగారు, కరణం, మోజకంపాడు.

2 చివుకుల అప్పయ్యశాస్త్రిగారు, సికింద్రాబాదా

3 రాయప్రోలు రాఘవదీక్షితులుగారు, పోలీసు సబిన్స్పెక్టరు, బాచేపల్లి

4 కాకుమాను హనుమయ్యగారు నర్సారావుపేట.

5 బాకరాజు పరాంకుశరావుదేశముఖుగారు, యాదవరము.

6 పిల్లలమర్రి సోమయాజులుగారు, తహసీలుదారు రేపల్లె.

7 పాపట్ల లక్ష్మీకాంతయ్యగారు, జగ్గయ్యపేట.

8 మొదకు శేషారావుదేశముఖుగారు, నల్లబల్లి.

9 హేజీబు వెంకటరామారావుగారు వకీలు సిరిసిళ్ళ.

10 పరాంకుశం శేషాచార్యులుగారు యాదగిరి.

11 ఓరుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమినీపురం.

12 వీరకాయల రామారావు దేశముఖుగారు రాయగిరి.

13 తోట్లకొండ హనుమంతరెడ్డిగారురామడుగు వగైరాసేక్ దారు, రామడ

14 శివపురపు వీరభద్రపాకయాజిగారు, సికింద్రాబాదా.

15 శ్యామపంతుల వెంకటేశ్వరరావుగారు తహశీలుదారు జెగితాల.

16 రాయవరపు గవర్రాజుగారు, మూలపేట.

17 జూపులూరి వెంకటరత్నంగారు వకీలు, గుంటూరు.

18 నారపరాజా వెంకట లక్ష్మీనృసింహారావుదేశముఖుగారు. అమ్మవరం

19 వెలమకన్ని శోభనాద్రిరావుగారు అడ్లూరుసివారు.

20 కంచిరాజు శంభయ్యగారు కరణం మల్లారెడ్డిగూడెం.

21 తూము రామానుజరావుగారు కట్రింపూడి.

22 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజిమునసిఫ్, నిడుబ్రోలు.

23 మల్లాది కామయ్యగారు, చింతపల్లిదొరసాని సంస్థానం గుంటూరు.

24 నెల్లుట్ల కేశవరావుదేశముఖుగారు, నెల్లుట్ల

25 పట్టెనర్సం సీతారామారావుగారు, వకీలు కంభంమెట్టు.

# అభినవసరస్వతి.

సంపుటము 10 } జానపాదు. కాళయుక్తి నం॥ భాద్రపదమాసము } సంచిక—9

## స్వవిషయము.

చదువరులారా!

సంచికలు మీకుఁ జాలఁ దడవుగాఁ బంపుచుంటిని. ఇందులకుఁ బ్రధానకారణము కాకితపుదారిద్ర్యమే కాని వేఱొండు కాదు. ఇదిగాక యేడేండ్ల కొడుకు మన్నిడిపించి పోవుటయు నేటేట నొక్కశిశువు పుట్టుచుం బోవుచునుంటచేఁ దద్దుఃఖనిమగ్నుఁడనై తన్నివారక కృత్యకరణములోఁ బడియుండుటయుఁ బైయంశమున కొక కారణమైయున్నది. చదువరులు చందాలు సకాలములో పంపకపోవుట మఱియొక కారణము. ఇట్టి కారణములచేనయిన కాలయాపనమును క్షమించుఁడు.

## బ్రాహ్మణ స్వభావము.

భారతవర్షమంతయు మతాంతరస్థుల పరిపాలనమునకులోనై హైందవమతధర్మముల బొత్తిగా విడనాడఁదగిన స్థితి ఘటించియున్న యిట్టికాలములో మన హైందవసంఘమున నైకమత్యభంజకమును బరస్పర విద్వేషావహమును నైన యొక నూతన వివాదాంశము ఘటించినది. అదియే బ్రాహ్మిన్సనియు నాన్ బ్రాహ్మిన్సనియు రెండుసంఘములుగా పిలువఁబడుచున్నది. విమర్శించి చూచిన సృష్ట్యాదినుండియు నీ రెండు సంఘముల పరస్పరమైత్రికే పలువిధములగు కారణములు కనుపించుచున్నయవి. నేటివరకు భరతఖండములోని యన్ని జాతులవారును బరస్పరసఖ్యముతోనే ప్రవర్తించుచున్నవారు. ఇపుడేని యిట్టి కలహములంకురించుటకు న్యాయములైన హేతువులు బుద్ధిశాలురకుఁ గనుపింపవని నానమ్మకము. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు వృత్తులు వేఱువేఱుగానుండి యొకరితోనొకరికిఁ బనికలిగియుండుటచే మైత్రియే వాటిల్లవలెఁగాని విరోధము ఘటింపఁగూడదు. ఇద్దఱు మనుష్యులు నొక లాభమునకే యపేక్షించినపుడుకదా విరోధముగలుగుట? ఏకభాగాభిలాషులగు నన్నదమ్ములకు సహజము విద్వేషముండుటయు నత్త మేనమామ కొడుకులు మొదలయినవారితో సహజముగా మైత్రియుండుటయు నిందులకొక తార్కాణము. బ్రాహ్మణులు పరిపాలనాం

దమకు దోషము వ్వాటిల్లుననియుఁ బ్రతిఫలశూన్యంబుగ ధర్మశాస్త్రములందు భరతాధులే నుడివియుండిరి. ఇట్టికరుణాశాలురగు బ్రాహ్మణులఁ బతుసాతులన నెట్లు చెల్లును ధన్వంతరి బాహాట చరకాదిమునులచే నాయుర్వేదమనఁబడు వైద్యశాస్త్రము బహుశాఖాప్రభేదంబుగ నిరూపింపఁబడియు నిట్టిభైషజ్యమాచరించుట బ్రాహ్మణులకు నింద్యమని చెప్పఁబడియుండె. ఇయ్యదియు నితరవర్ణస్థులకే యీయఁబడియుండెను వేయేల ఇప్పుడు గౌరవపాత్రమని యందరచేఁ గోరఁబడుచుండెడి యుద్యోగము (నౌకరి) యన్నదన్నూడ " సశ్వవృత్త్యాకద్యానన " యని బ్రాహ్మణ ధర్మము కాదనియు బ్రాహ్మణులు దాని నభిలషించుట తప్పనియు మహర్షులు ధర్మశాస్త్రములందు నుడివియున్నవారు. బ్రాహ్మణులే యీవృత్తులు గల్పించిరన్నను జీవనసాధనములని లోకులందఱు నెంచునట్టి యీ యాముఖ్యవృత్తులను గరుణార్ద్రదృష్టిచే నాయావర్ణజనులకొసంగి విశేషముగ నర్థసాధనముగాని యాజనాధ్యాపనప్రతిగ్రహములమాత్రమే తామంగీకరించి దానిలోనను విశేషతృష్ణకూడదనియుఁ జెప్పుకొని యుండిరి. ఇటుల స్వప్రయోజనము నేలెక్కగొనక లోకోపకారార్థమై పాటుపడెడి బ్రాహ్మణులపై నసూయవహించుట న్యాయదృష్టితోఁ జూచిన యుక్తముగాఁగనఁబడదు. శ్లో॥ ప్రతిగ్రహోయాచితస్స్యాదశ్యాత్రార్థంతుసమాహరేత్ స్థిత్యర్థాదధికంగృహ్ణన్బ్రాహ్మణోయాత్యధోగతిం॥ వృత్తిసంకోచమన్విచ్ఛేన్నేహేతధనవిస్తరం। ధనలాభే ప్రవృత్తస్తు బ్రాహ్మణ్యాదేవహీయతే॥ అని వ్యాసమహర్షి వచించియున్నాఁడు. ఆవిధముగనే పూర్వికులందఱును నటించియున్నవారు. ఒకవేళ నిప్పటిబ్రాహ్మణులు స్వకులధర్మములుమాని యుద్యోగనిరతులై యితరవర్ణోద్యోగములఁగూడఁ దామాచరించుచు వర్తించుచున్నవారలు. ఇట్టివార లితరవర్ణములయెడఁ గనికరములేక తామే ఘనత నొందఁగోరి తక్కినవారిని బాధించుచుందురుగాన వీరు దూషణార్హులనియెంచెదమా? ఈసంగతియు విచారణార్హమైయున్నది. ఇప్పటినవనాగరికాగ్రేసరులగు బ్రాహ్మణవంశజులు తమకులధర్మములగు యజ్ఞాదులను దుదకు సంధ్యావందనాదులను బరిత్యజించినను వర్ణాశ్రమములయందాదరములేనివారైనను శ్రోత్రియవ్రాత్యులగుటం జేసి మహర్షులవలన నందుఁ బొడమిన హేతువుచేత నేఁ గాఁబోలు నిమ్నజాత్యుద్ధరణ మను పేరితో శూద్రులు మొదలు చండాలురవరకుఁగల యాయాజాతులవారికి విద్యాలాభములఁగూర్చియు ధనలాభములఁ గూర్చియు ధనపూర్వకముగా వేవేలయత్నములఁ జేయుచున్నవారలు ఈసంగతి ప్రపంచజ్ఞానముగల వార్తాపత్రికాపాఠకులకందఱకును విశదమే. ఈబ్రా

హ్మణనవనాగరికులు శూద్రాదుల కెట్టి పనులఁ జేసిన మేలు ఘటించునో యాసంగతులు శాస్త్రానుసారముగా గ్రహింపనందున భ్రాంతులైనను వారియుద్దేశములు శూద్రాదిజాతులకు మేలుచేయుటయందే సర్వోత్సాహముగలిగియున్నవి. శాస్త్రజ్ఞానము గలిగి పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణులన్ననో శూద్రాదులఁ దత్తద్వర్ణోచితస్థితులయందుంచి వారికి దేవబ్రాహ్మణభక్తినిగఱపి కృషిశిల్పాదికర్మములందుఁ బ్రోత్సాహపఱచి వారికే జన్మాంతరములందుఁగూడ దుఃఖమువాటిల్లకుండునటుల సర్వవిధములఁబాటుపడుచున్న వారలు. గాన నవనాగరిక బ్రాహ్మణులు గాని సనాతనధర్మప్రవణులు గాని వర్ణాంతరస్థుల శ్రేయోలాభభంజకులుగారు. ఇప్పటివరకు శూద్రులు మొదలగువారలు బ్రాహ్మణుల కుద్యోగములీయఁగూడదనియు వారి కుత్కర్షయుండఁగూడదనియు వేనోళ్ళఁ బత్రికలలోఁగాని సభాముఖంబులఁగాని సువిస్తృతముగ నుపపాదించుచున్నవారలు. బ్రాహ్మణులలో నొక్కరుఁడేని శూద్రుల కుద్యోగములీయఁగూడదనికాని వారు గౌరవార్హులు కారనికాని వాక్రుచ్చుటలేదు. ఇదియే బ్రాహ్మణుల పరశ్రేయస్సహనమునకును సమాజశాంతికిని ముఖ్యనిదర్శనము కాకమానదు. "శూద్రోపి దశమీం గతః" యని వృద్ధుఁడగు శూద్రుఁడు గౌరవార్హుఁడని మనువునుడివెను. ఒకవేళ ధర్మశాస్త్రములందు నమస్కారాదులవిషయమై బ్రాహ్మణుల కితరవర్ణములవారు నమస్కరింపవలెననియు నితరవర్ణస్థులకు బ్రాహ్మణులు నమస్కరింపనక్కఱలేదనియుఁ జెప్పఁబడియున్నందున వారు స్వగౌరవముకొఱకయియే యత్నించిరని తలఁతమా? అదియును న్యాయ్యము కాదు. అరణ్యములలో వసించి శాకమూలఫలాదులతో దేహయాత్రనడపుచు శీతవాతాతపములసహించి పరలోకప్రధానులైవర్తించువారలకుఁ బెఱవారలు నమస్కరణార్హులనుట యొకవింత గాదు. ప్రజాపరిపాలనముచేయు చక్రవర్తులనివాసభూమియగు ద్వీపాంతరమందునివసించెడి తెల్లవారలతెగవానిఁగనిన వానియం దేయధికారము లేకపోయినను నా తెగవాఁడు కదా యను గౌరవముచే గుడ్మార్నింగు షేకుహ్యాండు మొదలగు గౌరవ కృత్యముల నెరపెడి శూద్రాదులలోని ప్రముఖులుగూడ నిందులకు నిదర్శనము. ఇట్టి బ్రాహ్మణులతెగవారిచే నమస్కరణము పొందఁదగిన యైహిక యోగ్యత గలిగియున్నను నటు నమస్కరణమునందుట పారలౌకికదుఃఖ సంపాదకమగు పాపమునొనఁగూర్చును గానఁ బూర్వికులగు సచ్ఛూద్రులు ప్రభువులైయుండినను విద్వత్తములైయుండినను గృష్ణదేవరాయలు సర్వజ్ఞసింగమనీఁడు బుక్కక్షోణిపాలుఁడు మొదలగువారు బ్రాహ్మణులకు

నమస్కరించి బ్రాహ్మణులవలన నమస్కారాది గౌరవములనందక ధర్మవ్యవస్థాపకులై వర్తించియున్నవారలు. ఇప్పుడాక్షేపించెడి శూద్రులలో నట్టిపండితులున్నట్లు కనబట్టదు. కృష్ణదేవరాయలు శ్రేష్ఠమగు విష్ణుచిత్తీయము రచించెను. మఱియొకరమరుకవ్యాఖ్యానము రచించిరి. సర్వజ్ఞసింగమనీఁడు జగద్విఖ్యాతుఁడు. ఈయన సభలో జయమందుటనుఁ బండిత కవి సార్వభౌముఁడగు శ్రీనాథుఁడు గూడ వెలుఁగొందినటుల

సీ॥ దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశుముత్యాలశాలఁ
బలుకుతోడై తాంధ్రభాషామహాకావ్యమైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టు కంచుఢక్కఁ
జంద్రశేఖరక్రియాశక్తిరాయలయొద్దఁ బాదుకొల్పితి సార్వభౌమబిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద। రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున వెలకొనియుండి నీవు। సకల సద్గుణ నికురుంబ! శారదాంబ॥

అను పద్యమువలనఁ గానవచ్చెడిని. వెనుకటి శతాబ్దములో నాంధ్రదేశములో ఖ్యాతిగాంచిన శ్రీవాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారిని సభలో నొక విద్వాంసుఁడు తమరు విద్వత్ప్రభువులని నుతింపఁగా నీవి సమాసమెట్లులనని విద్వాంసులనడిగెనఁట. కొందఱు పండితులు "విద్వాంశ్చాసౌ ప్రభుశ్చ విద్వత్ప్రభుః" విద్వాంసుఁడగు ప్రభువనియు మఱికొందఱు "విదుషాం ప్రభుః విద్వత్ప్రభుః" విద్వాంసులకుఁ బ్రభువనియుఁ జెప్పగా నాయభిప్రాయ మీరంతమగాదని "విద్వాంసః ప్రభవో యస్య విద్వత్ప్రభుః" విద్వాంసులు ప్రభువులుగాఁగలవాఁడవగుటచే విద్వత్ప్రభువుగా వాడఁబడుదునని యానెనఁట. ఇట్టి పండిత ప్రభువు విద్వాంసుల కెంత విధేయుఁడై యుండెనో చూడుఁడు. అయినది నాలుగగ్రహారముల నొసంగెను. ఇంక నెన్నియో పరలోకప్రధానములగు ధర్మములఁ జేసి కీర్తిదేహుఁడయ్యెను. గాన విద్యాశాఖలన్నియు లోపించి పరమతక్రాంతిచే వైదికధర్మములన్నియు నిర్మూలములు కాఁదగు సమయంబునఁ బరస్పర విద్వేషము వహింపక సనాతనధర్మ పరాయణులగు పండిత బ్రాహ్మణులకు మనోవాక్కాయములచే సర్వవిధముల సహాయము చేయుచు వృత్తికర్మలై జీవనాంతరముల నవలంబించిన బ్రాహ్మణులతోఁ బురాతన సమ్మానములవలె మైత్రిసలుపుచు దేశాభివృద్ధికిని సంఘాభివృద్ధికిని పాటుపడుచు ధర్మవర్గము నస్త్యతస్థితిఁ దెచ్చుటకై యందఱు నిస్స్వార్థ రథములలాగు నెంతయును బాటుపడినఁగాని మేలుచేకూఱదు. కావున నుత్కర్షాపకర్షములు శ్రుతిస్మృతిపురాణసిద్ధములై యందున నవ

లౌకిక ధర్మాచరణ విషయమై పరికింపఁదగినవి. శ్రుతులనాదులు. స్వతఃప్రమాణములు. అవి యొకనిచే రచింపఁబడినవి కావు. కాన బ్రాహ్మణులే వ్రాసిరనుట న్యాయము కాదు. స్మృతులు పురాణములు బ్రాహ్మణులగు మహర్షులచేతనే వ్రాయబడినవి కాని వాని నిజము పరికించిన నుపవాసాది వ్రతములును నాహారనియమము త్రిషవణస్నానము వనవాసము దారిద్ర్యము మొదలగువాని బ్రాహ్మణులకు తమకు ధర్మములుగా స్వీకరించి భక్ష్యాభక్ష్యనియమము లేక యథేచ్ఛముగ భుజించుటయు సర్వశిల్పములచే స్వేచ్ఛానుసారము జీవించుటయుఁ గర్మపరాధీనధర్మాధీనత్వము యథాశోకర్యముగ స్వతంత్ర్యానములఁగా నివసించుటయు మొదలుగాఁగల స్వాతంత్ర్యములు శూద్రాదులకున్నట్లు లిఖించుట చూడఁగా నీధర్మము లార్షజ్ఞానముచే నిరూపింపఁబడినవి కాని లోకదృష్టిచే రాగద్వేషమూలమున వ్రాయఁబడినవని న్యాయదృష్టిగల గ్రంథవిమర్శనశీలు రెవ్వరనఁజాలరు. ఈ ప్రకారి స్మృతి పురాణములననుసరించి బ్రాహ్మణవిధేయులై వర్తించిన పురాతనులగు సామాన్యశూద్రులుగాని శూద్రప్రభువులుగాని చెడిపోయినదేమియు లేదు. ఘనమయిన కీర్తినే సంపాదించుకొనిరి. ఇప్పటివారలు బ్రహ్మద్వేషమువలనఁ బొందఁదగిన లాభము గాన్పింపదు. లాభము లేకపోవుటయే కాక "బ్రహ్మద్వేషః కులక్షయః" అను శాస్త్రమే నిజమైనయెడల గొప్పనష్టముగూడ వాటిల్లునట్లు తోఁచెడిని. ఇప్పటి రాజకీయాంగ్లభాషయుఁ దచ్ఛిల్పములును వేదము కాదు. బ్రాహ్మణేతరులగు సన్నివర్ణములవారు నభ్యసించుటకు వేదశాస్త్రనిషేధమేమియును లేదు. బ్రాహ్మణుల ప్రతిబంధము మొదటికే లేదు. వారలావిద్యలయందుత్తీర్ణులైనయెడలఁ బత్త్రసేవకుల నొసంగుటకుఁ బ్రభుత్వమువారికిఁ బూర్ణానుగ్రహము కలిగియే యున్నది. ఇటులుండ బ్రాహ్మణులు కీడలుచేసిన యపకారమేదియు లేదు గనుక నిష్కారణముగ బ్రాహ్మణుల దూషింపక తాము ఘనముగ విద్యాపరిశ్రమము సంపాదించి కృతార్థులైన మాకందఱి కమితానందమే కలుగును. ఒకప్పుడు బ్రాహ్మణులు స్వధర్మచ్యుతులైనప్పుడు శూద్రాదులు తాము స్వధర్మమునందుండి బ్రాహ్మణులకు హితము బోధింపవచ్చును. "బాలాదపి సుభాషితం అమిత్రాదపి పరంధర్మ మాదధీతావరాదపి" అని మనుస్మృతి చెప్పుచున్నది. సోదరులలో నొక్కఁడవివేకియై వర్తించినపుడు వివేకియగు మఱియొక సోదరుఁడు వానికి హితము బోధింపవచ్చును గదా. కావున మనమందఱము నైకమత్యము దృఢపఱచుకొని యిహపరసౌఖ్యములు సంపాదించుకొనుటయే కర్తవ్యాంశము. మనకిట్టి విమతులఁ బోనాడి సౌమనస్యము శాంతియు నొసంగునటులఁ

పరమేశ్వరుని ప్రార్థించుచు నీవ్యాసమును ముగింపుచున్నవాఁడను. సమత్సరులై న్యాయపరిశీలనదృష్టిచేఁజూచిన దీనితత్త్వము గ్రహింతురని నానమ్మకము.

ఇట్లు — సనాతనధర్మాభిమాని విద్వత్సమాజానుమతుఁడు,

మల్లాది రామకృష్ణ విద్వత్సోమయాజి, బెజవాడ.

---

## బ్రాహ్మణేతరపౌరోహిత్యము.

బ్రాహ్మణేతరులు తమతమశాఖలలోనివారినే పురోహితులుగా నేర్పఱచుకొని వారిచేతనే శుభాశుభకర్మములు చేయించుకొనుట కక్కడక్కడ మొదలిడుచున్నారు. బ్రాహ్మణుల నాస్తిక్యమునుండి వెళ్లఁగొట్టినను బాగుగనుండును గాని వారి కేర్పడియున్న యనుచితస్థానముల నాక్రమింపఁజూచుట దేశానర్థము. వేదశాస్త్రచోదితములైన కర్మల నాచరించుట కొప్పుకొనుచు నవి యెవరిచేఁ జేయింపఁబడవలెనో వారిని త్యజించుట యేటిన్యాయమో యోజింపవలెను. పాశ్చాత్యులలోఁగూడ వేఱుగనున్న పురోహితులచేతనే జనులు వివాహాదికార్యములు జరిగించుకొనుచున్నారు. అక్కడఁ బ్రతివాఁడును గర్మకాండను నేర్చుకొని తనయిష్టమువచ్చినట్లుచేయింపఁ బ్రయత్నింపఁగూడదు. మహమ్మదీయులలోఁగూడ ఖాజీసాహెబు మొదలగువారే వివాహాదులు చేయించవలెఁగాని యేతురకయైనను వచ్చి కోరానుప్రకారమైనను జేయింపఁగూడదు. ప్రతిమతములోను నిట్టినిబంధనలుండును. అట్లు కానియెడలఁ బ్రతివాఁడును వివాహాదులు చేయించుచుండును. బ్రాహ్మణులు బహిరంగముగ యథావిధిగ వివాహములు చేయించుచుండుటచేతనే వానికి రిజిస్ట్రు రికార్డులు నవసరములేకయున్నవి. ధర్మశాస్త్రములు క్షత్రియవైశ్యశూద్రపురోహితుల నంగీకరింపవు. ఏబ్రాహ్మణేతరుఁడైనను నేయుద్ధతికైనను దనయిష్టమువచ్చినట్లు ముడిపెట్టవచ్చునేని సంఘముయొక్క కట్టుబాట్లు నశించును. సంఘ మరాజకస్థితికి వచ్చును. హైందవులలో నైకమత్యము చెడును. ఎప్పుడేని యీనూతనాచారము నవలంబించిన కుటుంబములకు దుర్దశలు సంభవించినఁ బూర్వాచారములకు విరుద్ధముగ నడచుటచేతనే యని యెట్టివారికైనను నొకప్పుడు గాకపోయిన నొకప్పుడైనను దోఁపవచ్చును. వారిగృహములలో స్త్రీలఘోష వేఱుగఁ జెప్పనక్కఱయే లేదు. ఈకాలములోఁ బ్రతివారును జంధ్యములు వేసికొని వేదోక్తకర్మములు చేయించుకొనిన నభ్యంతరము లెవ్వియును లేవు కాని వైశ్యులవలెనే తక్కినవర్ణములవారును బ్రాహ్మణులనే పురోహితులుగ నేర్పాటుచేసికొనుట మంచిది. వారివారికిఁదగిన బ్రాహ్మణులు దొరకకపోరు. శుభాశుభకార్యములను వారిచిత్తము వచ్చినట్లు చేయించెదరు. ప్రతికార్యములోను బ్రాహ్మణునకు సువర్ణదానము చేయవలసినట్లు ధర్మశాస్త్రములలో వ్రాయఁబడినను నొకకానితో వారిని మనము త్రెంపి వేయుటలేదా? సర్కారువారు రిట్టియభ్యంతరములను గలుగఁజేయుటలేదు కనుక బ్రాహ్మణేతరులు బ్రాహ్మణోద్యోగుల స్థానముల నాక్రమించుచుఁ బరిపాలనమునందియుఁ

[illegible] కిని బహుమానము జరిగితీరవలసినదే. ఇట్టిపట్లఁ [illegible] గుడప్రవేశనముగూడ గుర్తెఱుంగనివారు పెద్ద [illegible] ద్రులు [illegible] లగుదురు. వీరే గణాచారులు. వీరే సోదెచెప్పు లగు వారిత్యులందరును [illegible] ప్తులతో నోరసికొనువారు. వీరే పోజులతోఁ గాల్చు గారు. వీరే భజనపరులు. వీ[illegible] నువారు. వీరే యుగ్రనారసింహులు. వీరే వీరాంజనేయులు. తాదృశులు కాని యెంతెంతలేనివారలును వీరియెదుటికిఁ బోయి నిల్వఁబడఁగూడదు. మాటలాడఁగూడదు. మహాత్ములును బరమభాగవతులును వచ్చుచున్నారని యంజలిబద్ధులై నిల్వఁబడవలె. భృత్యానుభృత్యులు కావలె. ఈరోజులలో శ్మశానములవంక కేపనియున్నను నేగఁగూడదు. నొసట [illegible] పెట్టుకొనఁగూడదు. జపతపములు సలుపఁగూడదు. ఉత్తమవంశజులలోని సవయస్కులు నలుగురు కలసితిరుగఁగూడదు. గణాచారులలో గద్దెకాండ్రో చెప్పినమీఁదఁగాని తమకుఁ దోఁచినపైఁగాని జాడ్యవృద్ధికరులుగా ననుమానింపఁబడినవారిని నంగ్రములచేఁ బూజింతురు. దంతములం బీకింతురు. క్షౌరములు చేయింతురు. సున్నపుబొట్లు పెట్టింతురు. గాడిదెలపై నెక్కింతురు. ఊరేగింపుచేయింతురు. తుదకు గతప్రాణులంగూడఁ జేయుదురు. తెలివియును ధైర్యమును గలవాఁడెవఁడేని యుండి యభియోగము దెచ్చి ఋజువుచేయఁగల్గినచో గడ్డికంప దిందురు. కారాగృహములం బడుదురు. అమ్మవారిముందర మానిసికొక వేఁట తెగవలె. పొట్టపగులఁడినవలె. ఏదోపగులఁ దాగవలె. ఇందులో నా వేటముందు తెగవలె నా బండిముందు పోవవలె నని యన్యోన్యము కలహించుకొనుటయుఁ గలియఁబడుటయు మొదలగునవి కడపటికృత్యములై యమ్మవారిమాహాత్మ్యముననో యాదృచ్ఛికముగానో జాడ్యములునివర్తించినపిమ్మట నమ్మవారికొలుపులు ముగియును. గ్రామములోని 8 అణాలవంతు జనులిట్టిమూర్ఖులును 4 అణాలవంతు పిచ్చినమ్మకముగలవారును రెండణాలవంతు సమర్థులును నణావంతు పేతుకులును నగుటవలనఁ దక్కనయణావంతెవరేని విమర్శకు లున్నను వారియత్నము కొనసాగమి నీదురాచారము లూరూర నాటుకొనిపోయినవి. పట్టణములలోఁ గలరాతగిలినవారికి మందిచ్చుటకు వైద్యులు లభించుచున్నను బల్లెటూళ్లలో మట్టుకు లభింపదు. ఇతరరోగములకు మందునిచ్చువారలున్నను గలరాసంగతియే వారికిఁ దెలియదు. పల్లెలనుగుఱించి యుద్యోగు లశ్రద్ధచేయుదురు. గ్రామాధికారివద్దనుండి కలరారిపోర్టు పంపఁబడినను దానిని లెక్కచేయరు. లెక్కచేసినను గలరాశాంతించినతర్వాతవత్తురు. వారియశ్రద్ధయే గ్రామవాసుల నధోగతికిఁ దెచ్చుచున్నది. కావున నిందువిషయమై యత్యంతశ్రద్ధవహించి కలరాప్రవేశించినది మొదలు గ్రామములకు డాక్టరులఁ బోయిరా నియమించుచుఁ బైదురాచారముల నన్నింటిని భంగమాపాదింపఁ బ్రభుత్వమువారు ప్రార్థింపఁబడుచున్నారు.

11.

# గణపత్యుత్సవము.

ఈపేర నిజాము రాజ్యమున నల్లగొండజిల్లా జనగాం తాలూకాలోని నవాబుపేయను గ్రామంబున నాయూరిజాగీరుదారుఁడగు శ్రీ జెల్లపురవల రాఘవేంద్రరావుగారిచే వినాయకచతుర్థి మొదలుకొని యైదుదినములవరకు నేఁటేఁట దేవతాసేవనంబును బ్రాహ్మణాన్నప్రదానంబును విద్వత్సన్మాననంబును గావింపఁబడుచున్నయది. ఏతదుత్సవకర్త నిజామువద్ద మహాసభ్యపదవినలంకరించి తదభేద్యమునవర్తింపఁగలుగుట నఖిలరాజ్యతంత్రములును నతిస్వాతంత్ర్యముతో నిర్వహించుచు శౌర్యౌదార్యగాంభీర్యాదిసకలసద్గుణంబులచే జగత్ప్రఖ్యాతినందిన హనుమంతరావుగారికిఁ బౌత్రుఁడు. దానకర్ణుఁడై శరణేసురాశికి ధనరాసులనే వెదఁజల్లిన యట్టిమహాపురుషున కాత్మజాతుండగుటచేతనే యీరాఘవేంద్రరావుగారును నాత్మీయకీర్తికాంతామణి నఖిలదిగంతంబులకును ననిపి యనేకవిద్వాంసుల నాకర్షించుచున్నవాఁడు. వర్తమానమున సంగీతసాహిత్యాదిసకలవిద్యలును సన్మానకరులు చాలమందిలేక క్షయమునొందుచున్నమాట సత్యము. ఆయావిద్యల కధికప్రోత్సాహమొసంగుచు నాదరించుచున్న యవనీశ్వరులుగూడ నక్కడక్కడ నధివసించిరి. ఈయనయును నట్టివారిలో నొకరుఁడుగాఁ బరిగణింపఁదగియున్నవాఁడు. ఈసంవత్సరపు టుత్సవమునకు శతావధానులును నాశుకవులును నగు పిశుపాటి చిదంబరశాస్త్రి మున్నగు సంస్కృతపండితులును మైలవరసంస్థానసంగీతవిద్వాంసులగు బాపట్ల లక్ష్మీకాంతయ్యగారు, పురాణం కనకయ్యగారు, పోచంచెర్ల శివరామయ్యగారు, శివపురపు భద్రయ్యగారు మొదలగు గాయకులును నరహరిబావమున్నగు హరికథాకథకులును గాననైపుణ్యముగల రూపవతి మొదలగు రూపాజీవులును బలుమంది యరుదెంచి యాజాగీరుదారు నాస్థానభవనం బనుదినంబు నలంకరించుచు వచ్చిరి. యజమానుఁడు స్వయముగా సంగీతశాస్త్రజ్ఞుఁడగుటవలనఁ బాపట్ల లక్ష్మీకాంతయ్యగారికిని పురాణం కనకయ్యగారికిని నూటపదియాఱులు బహూకరించియు శివపురపు భద్రయ్యగారికి మెడలోనులగియు, శ్లో॥ విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమం। నహివంధ్యావిజానాతి గుర్వీంప్రసవవేదనాం॥ అను నార్యోక్తి సార్థముఁ జేసియున్నవాఁడు. "నజీరేమనియా" యను హిందూస్థానినాటకముగూడ నేతదుత్సవాంగంబులలో నొకటియైయున్నది. ఈనాటకంబునఁ బ్రతాపరాయ వసంత

కం॥ అక్కాలకౌశికుని కాల్
ద్రొక్కిన రాకాసి వెలఁది రోసపుమదలన్
వెక్కసపు బమ్మసారుఁలు
గ్రక్కున నొక కొందఱతని గలియఁబడి వడిన్॥ 201

ఉ॥ ఒక్కఁడు కఱ్ఱలాగుకొనె, నొక్కఁడు గడ్డముపట్టిపీఁకె, ని
కొక్కఁడు జుట్టుఁబట్టిదిగనూఁచె గుద్దులు వేసె నొక్కఁడిం
కొక్కఁడు బ్రొత్తెజందెముల, నొక్కఁడు గుడ్డలఁజీల్చె, మీసముల్
ఒక్కఁడు వట్టియూఁచె, మఱియొక్కఁడు పైనుమిసెన్ బసందుగాన్

ఉ॥ కొక్కసి మీఁద వ్రాలెనొకకుఱ్ఱఁడు, బొట్టును నాకెనొక్కఁ డిం
కొక్కఁడు దౌడపైఁజఱచె నొక్కఁడుసుఁదుస్క్యయటంచుఁ బంచె బల్
కుక్కల బమ్మసారితగు కోఁతుల నాటికి జోడునాఁగ, ని
ట్లొక్కజ మొందఁ మిన్నకయ యల్లరిఁ జేసెడి బమ్మసార్లకున్ 203

తే॥ చంద్రమతి మ్రొక్కి "బువివేల్పుకందులారం!
నాపయిని నెనరుంచి యీ బాపనయ్య
నేలుఁ"డని విన్నవించుఁడు నీలువుమోయి
నా పెపల్కులకలరి వారందఱపుడు 204

శా॥ "అమ్మా! నీదగు వాలుడిం జెనటి కొయ్యన్ మోఱకున్ నీనిఁబోఁ
నిమ్మంచున్ విడనాడినారమది కల్కి! నీపయింబ్రేముడిన్
జుమ్మా, నీవిపుడేగకుండినను నీసుల్ రోసముల్ దీరఁగా
నిమ్ముంకున్ గడిత్రాళ్ళఁగట్టి యొడలెల్లన్ నారగాఁజీఱమే" 205

మ॥ అనుచుం జెప్పుచు బమ్మసార్ల(రుగఁగా)నచ్చేడియుం గాంచి త్రొ
క్కిన తాఁచుం బలెరేఁగి బాపఁడను, "నం గీడొందనొప్పించిపో
యిన పేంద్రెల్లదలార్లచే బడరె యొక్కింతాగినన్, బాపురే!
మనఁగాఁ జేసితి చూడు నీపని యొకంజన్ దాటినం బట్టెదన్" 206

కం॥ అని పరుసంబులు వలుకుచుఁ
దనయింటికి మెల్లగాఁదు దక్కుచుఁజోరుడున్

చెనుసూకాలమ్మయనం
గానుసోకుల కత్తియనఁగగండు మొగముతోఁ 207
మూగుడు మేనఁజెమ్మట కంపువెట్రిగమ్మ
బత్త్రయాంవ్పలఁ బోలి పలుకులెసఁగఁ
బుడమిసినడువ దిబ్బుమని చప్పుడుపుట్ట
నుయ్యెలలట్లు కేళ్ళూఁగుచుండ
తిరుగుడుకండ్ల వెక్కురు చూపులే తేరఁ
బావులవలె గోగ్గిపండ్లుదనరఁ
చెనుజబ్బునఁ దలపై సినుప్పు సెలంగ
సేనాలవలె గోళ్ళు సెలఁగుచుండఁ
దుట్టసెదవులుఁ బెనువ్రేళ్ళు దోనెకడుపు
సుడినొసలుఁగొంగమెడ యెండి సోలుచనులుఁ
దొత్తిముక్కు వెడఁదనోరు దొప్పచెవులుఁ
బొనరికానఁగఁబడు దయ్యమనఁగ నొప్పి 208

వలమగునడుమును గలిగియ
దలువోడమఁగ నెదురఁగాఁబుడమి వేలుపుతో
య్యాలి కలహకంటకియనఁగఁ
జెలఁగెడి చెలిఁగాంచి తేనిచేతఁ వెఱఁగునన్॥ 209

పిల్లినిగాంచుచిల్కవలె బీతునసిల్చిన గోలఁజూచి యా
యిల్లరికత్తె "యోరిమగఁడా! పెఱచేడియనోర్తుఁదెచ్చినా
యిల్లుచొరంగఁజేతువె, యిదే నినుమోదెదఁగాచుకొ"మ్మటం
చొల్లక వానిపైని బడి యుగ్గుడు పీడఁగఁగొట్టెనక్కటా॥ 210

చేతనయినంత మట్టుకు
నాతఁడుఁదన యింతిఁబట్టి యడఁచె, నిటులబల్
ప్రోఁతయొద్దనఁ గొట్టుకొనుచు
నాతలతోఁ బెనఁగి నేలఁబడి పొర్లుటయున్॥ 211

తే॥ ఆపుడమివేల్పుకవఁగాంచి యక్కజంబు
పొదువఁ దొగపగకొలపు రాపొలఁతియాల్పు
దనముమించియుఁదగవు నేర్పునుదిరంబుఁ
గలుగు మాటలతోనిట్లు పలుకఁజొచ్చె 212

శా॥ "ఔరా! యిట్టుల దెబ్బలాడు మగవాండ్రాడంగులున్ నేలను
న్నారే? దోసమురాదె? లాఁతిపజ విన్నన్ నవ్వరే? సిగ్గుగా
దే? రాకాసితనాలఁ జెల్లుబడికద్దే యిచ్చటం, జాలుఁజా
లీరింకన్ జగడంబులాడకుఁడు, లెండీ పోరుటల్ నాయమే॥ 213

కం॥ సిరుసు బాలునుగలిసిన
సౌరునఁగాఁపురము సేయఁజను నాల్మగ లి
ట్లారక యే పోరుటతగ
వే? రట్టిడిగాదె వారి కిచ్చుట నచటన్"॥ 142

వ॥ అని కలహాకంటకి దెసం దిరిగి నెమ్మదితోఁ జల్లసపల్కుల
నిట్లనియె. 215

మ॥ మగవాండ్రొక్కెడఁగాకఁజూపినను గొమ్మల్ వారితోఁ బోరుటల్
దగునే? తిట్టినగొట్టినన్ మగనిపైఁదప్పించి మార్వల్కమొ
త్తఁగ బోయాండ్రకుఁ బాడియౌనె, గడివింతల్ పుట్టునే, వేల్పుఁగా
మగనిం గొట్టుటకంటెఁ గ్రొత్తడికి నేముంబున్నదే చూడఁగన్॥ 216

మ॥ వినుమా చేడియ! మున్ను జోగులచెలుల్ పేరెక్కికేకొంద, తా
ననబోండ్లందఱు వేల్పులట్ల మగలన్ నాయంబుగాఁగొల్చినం
దునఁగాదే యసమొంది పేర్వడసిరెందున్, సామియుం బ్రాపు వే
ల్పును జేపట్టుమగండె కాక పెఱలెప్పుంగారుచూ లేమకున్॥ 217

సీ॥ ఇక్కట్లతమ్ముల నేర్పంగఁజాలుచం
దురుమిన్కుమగని నెన్నుట మగువకు
వినుజగమిడునట్టి పెనుమంతరపుగట్టు
పెన్నిటిఁగొల్చుట బిత్తరికిని

గలవారికాసిచేసెడి
చెలువెవ్వరు లేరటంచుఁ జెప్పఁదగుం గిడిమిన్॥ 223

ఆ॥ అట్టులీవు సేతువనివిన్నె ఱుంగని
నాదు బ్రోలఁజంబ నమ్మఁగలనె
యీవు గరితవైన నేమువో నుకమొ పె
న్మిటిని జేరకిటకు మిడుకనేల॥ 224

కం॥ నామగనిఁ దగులుకొన్నని నీ
వీమాడ్కిని వానికెత్తులిడి మెదిరింపం
గా మరలింతువె, తాకను
చామా! నాచేతిదెబ్బఁ జవిచూతువు లే॥ 225

ఉ॥ నాపేరన్నను నీవెఱుంగవిదె, విన్నం బాఱ కీర్తింపఁగా
నోపంజాలుదె, మిత్తినైతము తలంకొందుర్ నను జెప్పినన్
వేపర్వెత్తుదు రిట్టివోర్ధువజ నాపేరూద, నాయిల్లనన్
బైపైనున్నదె, తోకచుక్కచుమి యిన్వాడంతకున్ బానిసా!॥ 226

శా॥ నామాటన్న నొకంజదాటవెఱచుం దా, నట్టినాపెన్మిటిన్
మోమోటం బిసుమంత లేక బిడియుంబున్ మాసి వెన్నంటి రా
నేమిరా? వచ్చినఁ జచ్చినట్లు పడియుంటే బాగె, యట్లుండ, కీ
వీమాడ్కిన్ నను మందలించుటకు బోటీ! యేటియిల్లాలవే"॥ 227

క॥ అని కటువులు పలుకుచు రా
యనిచిలుకలకొలికిబుగ్గలఁడఁచి పోవుచుచున్
గొనబైన కొప్పుఁ జేగొని
తనియని కినుక మొయినీడ్చి తన్నుచునుండన్ 228

తే॥ ఆలిగొట్టిన దెబ్బల నలసిసొలసి
సొమ్మసిలెఱుంగక నేలపైఁ బడిపొరలుచు
నెట్టకేలకుఁ దెలివొంది యిట్టులనియె
కాలకౌశికుఁ జాలినిగాంచి మ్రొక్కి॥ 229

జూచిన సకలంబును బ్రహ్మంబయగుట నిత్యశుద్ధంబులగు నీద్రవ్యంబులకు శుద్ధి యెన్నఁడుం గలుగనేరదు, సకలకార్యంబులకును గారణంబు బరమాత్మయగునని తర్కప్రమాణంబులచే నెఱింగి కారణాత్మదృష్టిం జూచిన సకలంబును విశుద్ధంబగునని వేదాంతంబులును స్మృతులును సాదరంబునం బలుకుచుండు, నట్లగుట సమస్తంబును స్వానుభవంబున, బరమేశ్వర స్వరూపంబుగాఁ జూచువానికి సర్వంబును విశుద్ధంబగుఁ సందియంబులేదని సూతుండు మహర్షివ్రాతంబునకు, మఱియు నిట్లనియె. 233

## అభక్ష్యనివృత్తి.

కం॥ పుడమిగలయభక్ష్యంబులు విడువఁగఁ దాఁజిత్తశుద్ధి వేగమ కల్గున్
గనుఁ జిత్తశుద్ధిగల్గినఁ బొడమున్ విజ్ఞానమీశబోధకమగుచున్॥ 234

కం॥ పరమేశ్వరవిజ్ఞాన
స్ఫురణంబున గ్రంథు లెడలిపోవును, మోహం
బిరవొందు, నభక్ష్యంబులు
గరిమన్ భక్షింపఁ జిత్తకలుషము గలుగున్॥ 235

తే॥ భావకలుషంబుచేత నేర్పడ జనించు
భ్రాంతివిజ్ఞాన, మదితోఁపఁబడి నిషిద్ధ
కర్మరతిఁ జేయు, దానన కల్మషంబు
సేయు, నంతట సంసారసిద్ధియగును॥ 236

కం॥ అటమీఁద ముక్తియెన్నఁడు
ఘటియింపదు, దానఁ జేసి కడుదూరముగా
నెటులైన నభక్ష్యంబులు
పటుబుద్ధిన్ విడువవలయుఁ బ్రాజ్ఞులకెపుడున్॥ 237

ఉ॥ అట్టియభక్ష్యవస్తుతతు లజ్ఞులకే ధర, బ్రహ్మవేత్తకున్
గట్టిగ సర్వమున్ లసదఖండనిజాకృతిఁదోఁచు, వేదముల్
"పట్టుగ నన్నమే, నెపెయ భక్షణచేసెద నే" నటంచు నె
వ్వట్టునఁ బల్కుచుండుటను బ్రాజ్ఞుఁడు(సర్వము)దాఁ గ్రసించెడిన్॥

3.65

వ॥ మఱియు బ్రహ్మకుక్షాదిక నానావిధజగజ్జాలంబు సర్వంబును మృత్యుసమేతంబుగా బ్రహ్మంబగుట బ్రహ్మవిదుండు బ్రహ్మంబైనతాను బ్రహ్మస్వరూపంబైనవిశ్వంబు భోజ్యంబుగా గ్రసించు, జాగ్రత్స్వప్నంబులఁదనయందు సంకల్పమాత్రంబుగాఁ బ్రకాశించు నీవిశ్వంబు సుషుప్తియందుఁ దానే గ్రసించినట్లు బ్రహ్మవిదుం డాత్మస్థితంబైనసర్వంబునుం దానే గ్రసింపుచుండు, నట్టివానికి భోజ్యాభోజ్యంబులు లేవు సత్తామాత్రంబు బ్రహ్మంబగు, సత్తాతిరేకంబుగా నేమియు లే, దట్లగుటచేనవిచారదశయందే సర్వమోహినియైన మాయ గలదుగాని విచారదశయందు లే, దదియు శివజ్ఞానవిహీనులనుఁదోచు, యోగులకు శివజ్ఞానబాధితయై దగ్ధమహావిధంబునఁ బ్రారబ్ధానుభవపర్యంతంబును దోఁచుచుండు, బ్రహ్మవిదుం డీజగంబుఁజూచియుం దన కన్యంబుగాఁజూడండట్లగుట నాతని కభక్ష్యంబు లే, దజ్ఞులకు భక్ష్యాభక్ష్యవిచారంబు చేయవలయు, నందు బ్రహ్మవిదులుగాని బ్రాహ్మణులకభక్ష్యపరిహారంబును వ్యవస్థ శివునిచే నిర్ణయింపంబడియె, నదెట్లనిన. 239

సీ॥ లశునద్వయము విడ్వరాహంబు గంజయు
గంధవర్ణరసాదికలనచేత
వరపలాండుసమానవస్తువులన్నియుఁ
గుక్కుటచ్ఛత్రాకగోధికలును
వార్తాకశిగ్రుకవసుమతీలవణంబు
లింగువనువినాగ నెల్లచెట్ల
పాలూషరంబగు నేల మొలచినట్టి
తృణము చిప్పకసన్ను ద్విజుఁడు కోర్కె
నైన నవశంబుచేనైన నశనముగను
గొనుటగూడదు, శ్రుతిబాహ్యజనముచేత
నంటఁబడినట్టివస్తువు లశనముగను
గొనుటకూడదు బ్రాహ్మణజనము కెపుడు 240

నైన క్షాళనంబును నధికంబైన ప్రోక్షణంబును, నుదక్యాంత్యాదిదూషితంబైనపక్వాన్నంబు పరిత్యజింపవలయు, నదియు భారషట్క-పరిమితంబయ్యెనేని క్షాళనంబుచేసి ప్రోక్షణంబుచేయవలయు, నుదక్యాంత్యాదిస్పృష్టంబును శ్వసూకరఖరోష్ట్రాదిస్పృష్టంబును నైనవస్త్రంబు క్షాళనంబుసేయవలయు, నూతనకాషాయచిత్రరక్తకృష్ణవస్త్రంబులును గంబళాదికంబును ప్రోక్షణంబున శుద్ధియగుఁ, దండులాదిధాన్యంబులును గుడాదిరసద్రవ్యంబులును గాకాదిదూషితంబులైన దదంశంబులువిడిచి శేషంబుల క్షాళనంబున శుద్ధిచేయందగు, సకలద్రవ్యంబులును వాయుపూతంబులగుచు శుద్ధంబులయ్యును దుష్టభాండస్థితివలనే నపవిత్రంబులగు, నీద్రవ్యంబులకు ధాన్యంబులకుంబోలె శుద్ధిచేయువలయు, నలభ్యద్రవ్యమందుఁ బ్రోక్షణంబుచేతనే శుచిత్వంబుగల్గుఁ, గేశలోమనఖకీటమక్షికాదిదూషితంబైనయన్నంబు భస్మంబుచేతను బ్రక్షాళనంబుచేతను ఘృతంబుచేతను శుద్ధంబగు, శూద్రాంత్యాశుచిసంస్పృష్టంబైనయన్నంబు త్యాజ్యంబగు, ననేకంబులగుధాన్యవస్త్రాదుల కశుచిత్వంబువాటిల్లిన నుదకప్రోక్షణంబున శుచిత్వంబుసంభవించు, ఫలంబులకు క్షాళనంబున శుద్ధియగు. సురాస్పర్శంబులకు నగ్నిదాహంబునశుద్ధియగు, శ్వచండాలాదిస్పర్శనంబులైన తైజసంబులు మార్జనంబునను బ్రోక్షణంబునను దింత్రిణ్యామ్లశోధనంబునను భస్మమృజ్జలాదులచేతను శుద్ధియగు, నుదక్యాభుక్తకాంస్యపాత్రంబునకు నగ్నిస్పర్శనంబునను క్షాళనంబునను శుద్ధిగలుగుఁ, గల్యాణ తీర్థయాత్రాదేశక్షోభ విభ్రమదేవోత్సవ దారిద్ర్యంబులయందు స్పృష్టిదోషంబు లేదు, శూద్రానులోమప్రతిలోమకాకాదిదూషితంబులైన ద్రవ్యంబులు మృజ్జలాదులచేతను నేకవింశతిమార్జనంబులచేతను శుద్ధియగు, నశుచియగు శిలాపాత్రభస్మజలంబులచే శుద్ధినొందు, నబ్జశంఖశుక్త్యాదిద్రవ్యంబు లన్నియుఁ బ్రక్షాళనభస్మమార్జనంబుల శుద్ధినొందు, నింక బహూక్తులంబని లేదు, సత్యాదిలక్షణంబును నిత్యశుద్ధంబును నగు బ్రహ్మంబుగా భావించిన సకలద్రవ్యంబులును శుద్ధినొందు, బ్రహ్మదృష్టిఁ.